# భోజకుమారము

## నాటకము

కర్త: తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులు
పించన్ డిప్యూటీ తహాశ్శిల్దారు
రాజమహేంద్రము.

# BHOJAKUMARAM

BY

**TADURY LAKSHMI NARASIMHA RAO**
*Retired Dy. Tahsildar*
RAJAMUNDRY

1ST EDITION—1000 COPIES.

PRINTED BY
V. VENKATESWARA SASTRULU
of V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE 'VAVILLA' PRESS,
Madras.—1934.



వెల రు. 0 12 0.

# భోజకుమారము

## నాటకము

కర్త: తాడూరి లక్ష్మీనరసింహారావుపంతులు
పించన్ డిప్యూటీ తహశ్శీల్దారు
రాజమహేంద్రము.

# BHOJAKUMARAM

BY

TADURY LAKSHMI NARASIMHA RAU
*Retired Dy. Tahsildar*
RAJAMUNDRY

1st EDITION—1000 COPIES.

PRINTED BY
V. VENKATESWARA SASTRULU
OF V. RAMASWAMY SASTRULU & SONS,
AT THE 'VAVILLA' PRESS,
Madras.—1934.



Price Rs. 0 12 0 వెల రు. 0 12 0

# పీఠిక

భోజకుమారమను నీనాటకము నేను రచించి నలువదిసంవత్సరము లయ్యెను. ఇప్పుడచ్చువేయించి లోకమున కొసంగుచున్నవాఁడను. ఇందలికథ చారిత్రకమైనది. అది దేశములో సామాన్యముగ సర్వజనులకు నెఱుకపడినభోజచరిత్ర యనుగ్రంథమునుండి గైకొన్నవాఁడను. కావున దీనికిఁ బీఠిక విస్తరింపఁ బనిలేదు. ఐనను గథాసంగ్రహ మీచిన్నపీఠిక కనుబంధముగాఁ జేర్చినవాఁడను. పాఠకులెల్లరు దయతో నా యీకావ్యము నాదరింతురుగాక.

రాజమహేంద్రము
21-12-1933.

తాడూరి లక్ష్మనరసింహారావు.

# నాటకకథాసంగ్రహము.

## ప్రథమాంకము.

భోజకుమారుఁ డేఁబదియైదుసంవత్సరము లేడుమాసములు మూడుదినములు గౌడదేశసమేతంబుగ దక్షిణాపథ మేలఁగలవాఁడని యొక జ్యోతిష్కుఁడు చెప్పుటయు భోజకుమారుని భువనేశ్వరీవనము నకుఁ గొంపోయి వధించి వానితల రాత్రి జాముప్రొద్దుపోయినప్పుడు తెచ్చిచూపుమని ముంజరాజు తన కాజ్ఞయిచ్చినవాఁడని చెప్పి దుఃఖించుచు భోజకుమారునిఁ బిలిపించి రథముమీఁదఁ గూర్చుండఁ బెట్టికొని సామంతుఁడైన వత్సరాజు భువనేశ్వరీవనమునుగూర్చి పోవును.

## ద్వితీయాంకము.

వత్సుఁడు చేయనున్న పాపకృత్యము రహస్యంబున విని యది మానిపింప నిచ్ఛయించినవాఁడై యాతనియన్న యగుబుద్ధిశాలి యాతని కంటె ముందే భువనేశ్వరీవనమునకు నిగూఢంబుగఁ బోయి కూర్చుండి యాతఁడు భోజకుమారసహితము భువనేశ్వరీవనము చేరినతోడనె వారిని గలసికొనును. అక్కడ ముప్వురకును బెద్దప్రొద్దు సంభాషణముఁ జరగును. ఆసంభాషణములో భోజకుమారుని వధింపఁగూడదని బుద్ధిశాలియును నాజ్ఞచొప్పున వధచేసెదనని సామంతుఁడైనతాను దన యేలికయైన ముంజరాజుతో ముందు చెప్పియుండుటచే వధచేయక మానననని వత్సరాజును రాజునాజ్ఞ యుల్లంఘింపఁగూడదని భోజకుమారుఁడును వాదించికొందురు. వారు తమతమవాదముల కనుగుణముగఁ గారణములు వక్కాణింతురు. రాజునాజ్ఞ జరపవలయునదే యని యావాదములోఁ దుట్టతుదకు నిర్ధారణ యగును. అప్పటికిఁ

ప్రొద్దు గ్రుంకి చీకటిపడును. అంత బుద్ధిశాలి వనమునుండి తనయింటికి మరలిపోవును. వధార్థమై భోజకుమారుని గొని చెంతనున్న భువనేశ్వరియాలయములోనికి వత్సరాజు వోవును.

## తృతీయాంకము.

భోజకుమారుఁడు వధింపఁబడె నన్న వార్త పట్టణమెల్లఁ బొక్కును. ముంజరాజును వానిరాణియగు సుశీలాదేవియును భోజకుమారుని తల్లి సావిత్రీదేవియును నంతఃపురములో నొకకూటములోఁ గూర్చుండి దుఃఖింతురు. విదూషకుఁడును బరిచారికలునుగూడ నందుందురు. దుఃఖానంతరము పరిచారికలు సావిత్రీసుశీలల నూఱార్చి లోపలిభవనమునకుఁ గొంపోవుదురు. పిమ్మట ముంజరాజును విదూషకుఁడును గొంతసే పక్కడనేయుండి వధ్యమానుఁడగు భోజకుమారుఁడు తమలో ముంజరాజునకుఁ దనరక్తముతో మఱ్ఱియాకులమీఁదఁ బద్యరూపమున వ్రాసిపంపిన లేఖ చదివికొందురు. ఆలేఖలోనిసంగతుల విషయమై వారిద్దఱకును బెద్దయుంబ్రొద్దు సంభాషణము జరగును. ఆ సంభాషణములో విదూషకునియుపన్యాసము మిక్కిలి విచిత్రముగా నుండును. తుదకు భోజనసమయమగుటయు వారునుగూడ దుఃఖోపశమనము చేసికొని లోపలిభవనమునకుఁ బోవుదురు.

## చతుర్థాంకము.

తాను జేసినపాపకృత్యమునకుఁ బశ్చాత్తాపముపుట్టి తనకు శిక్ష విధింపుఁడని తనసభ్యులయిన బ్రాహ్మణులను వేడుటయు నగ్నికుండంబునంబడి ప్రాణములు విడువుమని వారు నిష్పక్షపాతబుద్ధితోఁ దీర్పు దీర్చుటచే ముంజరాజు నిప్పులగుండ మేర్పఱపించి తనమంత్రియైన దనగుప్తునితోడను బూర్వపుమంత్రియైన బుద్ధిసాగరునితోడను నిప్పులగుండమునొద్దకుఁబోయి యక్కడ దుఃఖించును. ఆసమయమందే పట్టణములోనిప్రజలెల్లరును రేగి రనియు నందుఁ గొందఱు తనభృత్యు

లను వధించిరనియును మఱికొందఱు గజశాలాదులు తవ్వులఁబెట్టి రనియును మఱియును దన్నుఁ బురమధ్యంబునకుఁ గొంపోయి. కొఱుతవేయనున్న వారనియును ముంజరాజునకు వార్తలు వచ్చును. అప్పు డేమియుఁ జేయునది లే కతిదీనుండై తనపాపము లెల్ల వెల్లడించి ముంజరాజు కనికరముపుట్టునట్లు భగవంతునిఁ బ్రార్థించును. ప్రార్థనా పూర్వదీనసంభాషణము లాతఁడు వలుకుసమయంబున దైవయోగం బున నెందుండియో యొక కాపాలికుఁ డక్కడకు వచ్చును. ముంజ రాజు దీనుండై వానిపాదములమీఁదఁబడి నమస్కరించి తనపాప కర్మము విన్నవించి తన్నుఁ జంపి భోజకుమారుని బ్రదికింపుమని కరుణ ముగా వేడుటయు నాసిద్ధుఁడు వానికిఁ గరుణించి నిన్నుఁ జంపకయే భోజకుమారునిశిరస్సును మొండెంబును నదికించి ప్రాణముఁబోసి యిచ్చెదనని వరమిచ్చును.

## పంచమాంకము.

భోజకుమారుఁడు పట్టాభిషిక్తుఁ డగును. ఆకాశవాణి యాశీర్వ దించును. ముంజుఁడు వనవాసమునకుఁ బోవును.



# ఈ నాటకమునవచ్చు పాత్రములు.

## పు రు షు లు.

1 భోజకుమారుఁడు—సింధులమహారాజు కుమారుఁడు.
2. ముంజరాజు—సింధులమహారాజు తమ్ముఁడు.
3. జయంతుఁడు—ముంజరాజు కుమారుఁడు.
4. వత్సరాజు—సామంతరాజు, వంగదేశాధిపతి.
5. శ్యామాచార్యుఁడు—ఉపాధ్యాయుడు.
6. బుద్ధిశాలి—వత్సరాజునకునన్న.
7. వాధూలుఁడు—విదూషకుఁడు, ముంజరాజునకు వేడుక చెలికాఁడు.
8. బుద్ధిసాగరుఁడు—సింధులమహారాజుమంత్రి.ముంజరాజుచే మంత్రి పదవినుండి బహిష్కరింపఁబడ్డవాఁడు.
9. ధనగుప్తుఁడు—ముంజు నియిష్టమంత్రి.
10. ఖరుఁడు }—కంచుకులు.
11. పింగళుఁడు }
12. సూక్ష్మబుద్ధి—చారాగ్రేసరుఁడు.
13. వీరదాసుఁడు—యోధాగ్రేసరునిభటుఁడు.
14. విచిత్రవర్మ—ముంజరాజు నాత్మరక్షకభటనాయకుఁడు.
15. ద్వారపాలకుఁడు.
16. కాపాలికుఁడు.
17. బ్రహ్మశర్మ }
18. శివశర్మ }—పౌరులు.
19. నారాయణశర్మ }
20. సూత్రధారుఁడు.
21. సదస్యులు—బ్రాహ్మణులు.

## స్త్రీలు.

1. సావిత్రీదేవి—భోజకుమారునితల్లి.
2. సుశీలాదేవి—ముంజరాజుభార్య.
3. ఆకాశవాణి.
4, 5. చేటికలు.
6, 7. ముత్తైదువులు.

---

శ్రీ

నారాయణాయ నమః

# భోజకుమారము

## ప్రస్తావన.

---

ఉ. ఎవ్వని యల్కచేత ఖలులెల్లను దాము వృథాప్రయత్నులై
యవ్వల మానహాని విపదంబుధిలోపల మున్గుచుండు వా
రెవ్వనిప్రేమచే సుజనులెల్ల విపద్ఘనవార్ధి దాఁటి తా
మవ్వల సౌఖ్యముల్ గనుదు రవ్విభుఁ డిచ్చుతశోభనంబులన్. 1

[నాంది యనంతరంబ సూత్రధారుఁడు వినయముతోఁ బుష్పాంజలి చల్లి తెరవంక చూచి]

ఓనే నటీ యిటురమ్ము.

నటి.—[ప్రవేశించి] ఇదె వచ్చినదానను బావా!

సూత్ర.—ఈసభను జూచితివె కలువకంటీ!

ఉ. కొందఱు భూవరుల్ దొరలు కొందఱు చూడఁగఁ బండితోత్తముల్
కొందఱు వావదూకులును గొందఱు చూడ మహాకవీశ్వరుల్
కొందఱు రాజనీతులను గోవిదు లారయఁ దీర్పకర్తలుం
గొందఱు నొచు నేఁడు సభగూడినవారిట నిమ్మహామహుల్. 2

మఱియును,

క. దమయంతులు విద్యాప్రౌ
ఢిమ శచు లైశ్వర్యమునఁ గడిఁది పాతివ్ర
త్యమునను లోపాముద్రలు
నమరఁగ నైరీ సదస్సునందలియమ్మల్. 3

కావున నొక మంచినాటకముచే నీసభను సేవించి కులక్రమాగతంబగు మననాట్యవిద్యాకౌశలము సఫలము చేయుదము.

నటి.—భరతకులశ్రేష్ఠుండైన బావ కెట్లిష్టంబైన నట్లే. మఱి యేకవీశ్వరునినాటకమాడి సభ్యులమనస్సులను రంజింపఁజేసెదవు బావా?

సూత్ర.—ప్రాణనాయికా! రంజింపఁజేయుట రంజింపఁజేయుట
యందురు. రంజింపఁజేయుట సామాన్యమా?

తే. అవనిలోఁ గృతిరంజకం బగుట యొకటి
యరయ దానను రంజితం బగుట యొకటి
తేఁటి పువ్వుమీఁదను వ్రాలి తేనెఁ గొనును
పాలెపురుగైన నందె విషంబుఁ గొనును. 4

కావున రంజకత్వ మెదిరి గుణగ్రాహిత్వమునుబట్టి యుండును. అదియునుంగాక లోకములోఁ గొందఱు విమర్శయందు స్వతంత్రులు గాక పరతంత్రులై యుందురు.

తే. ధరస్వతంత్రుల నెన్నఁడుం దనుపవచ్చు
ననువుపడ దెందుఁ బరతంత్రులైనవారిఁ
గామలలుపట్టియున్నట్టి కంటితోడఁ
గన్నదెల్లను బచ్చగాఁ గానఁబడును. 5

ఈకారణంబుచేఁ బరుల రంజింపఁజేసెదనన నేర్తునే? అయినను మనసభ్యులందఱు ప్రసన్నచిత్తులు మఱియును

తే. అట్టివారల రంజింప సర్వరీతిఁ
గృతులు చేయఁ దాడూరి లక్ష్మీనృసింహ
రాయకవిసింహుఁ డుండంగ రాజవదన
మనకు భయమేమి లేదు సుమ్మాతలంప. 6

ఆకవిచేసిన భోజకుమారమను నాటకము నేనాడి నానాట్య విద్యాకౌశలముచేతను సభ్యులమనస్సులను గొల్లగొనెదను.

నటి.—మఱి మొట్టమొదట నే నేమిచేయవలయును జెప్పుము
బావా?

సూత్ర.—ఈ గ్రీష్మర్తుతాపమునుగూర్చి పాడుము చెలియా!

నటి.—

సీ. మిడిమిడి యెండలో మిడుకుచుండుటకంటె
మంచిపాత్తిది నాకు మనఁగ ననుచు
నొకకప్ప మది నెంచి యొయ్యన నొకపాము
పడగనీడను జేరి పడియె నంత

వడిమబ్బుఁ జినుకురాఁ దొడఁగినఁ దగవచ్చి
కెరలుచుఁ గడు వేడ్కఁ గేక లిడుచు
వెడఁదపింఛము విప్పి ప్రియురాలి ముద్దాడి
నృత్యమ్ముచేసెఁ దా నెమిలి యొకటి
గీ. అంత నెంతయు బెగడొంది యల్లపాము
పుట్టలోఁ దూరెఁ గప్ప తా మిట్టిపడుచుఁ
గరము మిట్టాడెఁ బరమాత్మకరుణ గలుగ
మృత్యుదేవియు దూరమై యేగుఁగాదె. 7

సూత్ర.—[తృప్తి నభినయించి] ఆహా యెంత సరసముగా నున్నదే నీపాట ముద్దుగుమ్మా! నీవు గ్రీష్మతాపవర్ణనము సేయుటయే గాక నాయాడఁబోవు నాటకకథనుగూడ సూచించితివి.

నటి.—ఇదియంతయు బావగారిదయ.

తెరలో

నారాయణ నారాయణ! యేమి దురంతము!

సూత్ర.—[కొంచెము నడచి తెరవంకఁ జూచి] వీఁ డెవఁడు చెలియా ఘోరమైన యకార్యకరణ మొకటిచేయఁబూనియు నించుక శంకించు యమకింకరుఁడువోలె రథము ముందఱ నిల్చున్న వాఁడు?

ఉ. నల్లనియుత్తరీయమును నల్లనిదోవతి నల్లయంగియుఁ
నల్లనిపాగఁ దాల్చి కయి నల్లను గోరెడుకత్తిపట్టి తా
నల్లయముండు పంపఁ గర మాఁకొని యున్నయకాలమృత్యువో
తెల్ల మనంగ నొప్పి యిటఁ ద్రిమ్మరఁజొచ్చెను భీకరాకృతిఁ. 8

[నిరూపించి]

ఓహో తెలిసినది తెలిసినది. వీఁడు నామేనమఱఁదిగదా భోజకుమారునితల నఱకుట కాజ్ఞాపింపఁబడిన వత్సరాజు వేషము వేసికొని యిక్కడకే వచ్చుచున్నాఁడు. మనమును సత్వరంబుగఁ దగినవేషంబులు వేసికొనఁ బోవుదము.

[ఉభయులు నిష్క్రమించుచున్నారు.]

ఇది ప్రస్తావన.

# భోజకుమారము

## ప్రథమాంకము.

---

రంగము - ధారాపురము.

అప్పుడు పయినిజెప్పినరీతి భువనేశ్వరీవనాభిముఖముగా నిల్చియున్న రథము ముందఱ నిల్చున్నవత్సరాజు ప్రవేశించుచున్నాఁడు.

వత్స — [చింత నభినయించి తనలో] నారాయణ నారాయణ యేమి దురంతము!

ఆ. అయిదు పదులు నైదు నగువత్సరమ్ములు
మూఁడునాల్గునెలలు మూఁడునాళ్లు
దక్షిణాపథంబు తగగౌడతోఁగూడ
భోజరాజుచేత భోజ్య మగును. 9

అని యొకానొకజ్యోతిష్కుఁడు చెప్పినంతమాత్రముచేతఁ గదా "వత్సా! నీవు పోయి భువనేశ్వరీవనమందు" భోజుని జంపి వానితల రాత్రి మొదటిజామున "నంతఃపురమునకుఁ దెచ్చునది" యని మాస్వామి యగు ముంజరాజు నన్నాజ్ఞాపించినవాఁడు. నేనేమి చేయుదును. కానిపని యని వినయపూర్వకముగ నేనెంత విన్నవించినను విన్నాఁడు కాఁడు. కటకటా యెంతపాపకర్మముచేయ వలయుట సంభవించినది నాకు! నేను సేవకుఁడ నగుటచే నామాట యాతని మది కెక్కదుగదా! ఓసేవా యెంత దూష్యురాలవె నీవు!

సీ. చందమామను మించు నందంబుగలవానిఁ
జీ! కురూపియగాఁగ జేయుదాన
అలసుమేరువునైన నడఁగించు దిట్టరిఁ
జీ! పందగాఁగను జేయుదాన
ఉక్కుమీఱిసురేంద్రు లెక్కసేయనివాని
జీ! యస్వతంత్రునిఁ జేయుదాన

అలదేవ గురునోర్చు నతిబుద్ధిశాలిని
జీ! బుద్ధిహీనుని జేయుదాన
తే. అల్ల సత్యహరిశ్చంద్రు నట్టివాఁడు
చెప్ప నిజమును జీ! బొంకు సేయుదాన
అవనినో సేవ! కటకటా! యక్కటకట!
కలదె నీచేయలేని యకార్యమొకటి.

ఛీ! నిన్ను నమ్మినవానికంటెఁ బనికిమాలినవాఁడు లోకములో లేఁడు. ఓ సేవకవృత్తీ యిప్పుడు నిన్ను విడిచి బిచ్చమెత్తికొని క్షేమముతో బ్రదుకుదునా? అయ్యో దానికి నా కధికారము లేదుగదా! ఈరాచపుట్టువేల పుట్టితిని? నేను బ్రాహ్మణుఁడనైన నాకింతవిచారము లేకపోవును గదా! షట్కర్మాధికారియగుటచే బ్రాహ్మణుఁ డెంత యదృష్టవంతుఁడు! ఓ దైవమా యిప్పుడు నాకు బ్రాహ్మణ్య మియ్యవే. ఇచ్చిన నే నీక్షణమ నాగ్రామములు రాజున కిచ్చి సేవాబంధము త్రెంపి పాఱవైచి బిక్షుఁడనై సుఖముగ నుండువాఁడను. అయ్యో! యెంత పిచ్చివాఁడను నేను! ఇప్పుడు దైవము నీవేషముతో నాపాట్లకై నేను వేఁడినంతమాత్రముచేత నాకు బ్రాహ్మణ్య మబ్బునా? అబ్బదు. నక్క యెక్కడ దేవలోక మెక్కడ! అనిలాహారులు నూర్ధ్వబాహులునై యంగుష్ఠాగ్రము నేలమోపి పంచాగ్నిమధ్యంబున నిల్చుండి తొల్లి వేలకొలఁది యేండ్లు తపంబుచేసిన విశ్వామిత్రాదులకే దరిలేక పోయెను. అట్టిచో నిపుడు నే బ్రాహ్మణ్యముం గోరుట యందనిమ్రాని పండ్ల కట్టుచాచుట గాదే? ఇఁక నాకు బ్రాహ్మణ్యమును దొరకదు, బిక్షాధికారమును రాదు మంచిచెడ్డ లాలోచింపని రాజేలురాష్ట్రములో సామంతుఁడనుగా నుంటకంటె నొక్కకాపునై యుంటినే నది యిసుమంత మేలుగా నుండునుగదా! పోనీ యాఁకలిచేఁ జత్తమని యొకవేళ నాయుద్యోగము విడిచిపెట్టఁదలఁచినను దానికి రాజంగీకరించునా? అంగీకరింపఁడు. మీఁది మిక్కిలి పుణ్యమునకుఁబోతేఁ బాప మెదురువచ్చెనన్నసామెతగ నాబుట్ట నణఁకించును. అప్పుడు నాదారపుత్రాదులుగూడఁ దిండిలేక మలమలమాఁడుదురు. ఒక్క బాలునిజీవము నిలుపుటకై నాజీవముఁ బోఁగొట్టికొననేల? నాకుటుంబ నాశనముఁ జేసికొననేల? "జీవన్ భద్రాణి పశ్యతి" యన్నాఁడు.

జీవించియున్నప్పుడుగదా యేసుఖములనైన ననుభవించుట! అది యునుగాక యీనష్టములకన్నింటికి నే నొడంబడినను భోజకుమారుని ప్రాణమునిల్చునా? నిల్వదు. రాజు దలఁచిన దెబ్బలకుఁగొదవా? నాచేఁ గాకున్న మఱియొకభృత్యునిచే రాజు తనయిష్టము తీర్చి కొనఁగలఁడు. ఏవిధమునఁ జూచినను భోజకుమారుని చావు తప్పించుటకు సాధనము కానిపింపదు. కావున నిప్పుడు రాజు నాజ్ఞ నెఱవేర్చువాఁడను. [ఆలోచన మభినయించి మనస్సులో] భోజు నొక్కనిఁ బిలిపించితినే నాతఁడు మఱియొకవిధముగాఁ దలంచును గావున మొదట జయంతుని బిలిపించెదను. వారిద్దఱు నిప్పుడు పాఠశాలలో నున్నవారు. వారియుపాధ్యాయుఁ డగుశ్యామాచార్యునకు వర్తమానముఁ బంపితిని. ఆతఁ డింకను రాఁడయ్యెను.

[శ్యామాచార్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వత్స.—తాతా పండితా! ఇదె నమస్కారము [నమస్కరించుచున్నాఁడు.]

శ్యామా.—[భయవిషాదము లభినయించుచు] మనోవాంఛాఫలసిద్ధిరస్తు.

వత్స.—తాతా రాజకుమారుఁడైన జయంతుని దోడితెమ్ము.

శ్యామా.—[నిష్క్రమించి మఱల జయంతునితోఁ బ్రవేశించుచున్నాఁడు.]

వత్స.—(జయంతునితో) దేవరవా రేమి చదువుచున్నారు?

జయం.—బాలరామాయణముఁ జదువుచున్నాను.

వత్స.—ఆఱుసంవత్సరముల బాలుఁడు బాలరామాయణముఁ జదువుట లెస్సమాట. [ఉపాధ్యాయునితో] తాతా జయంతుని గొనిపోయి భోజకుమారుని దెమ్ము.

శ్యామా.—[జయంతసహితముగా నిష్క్రమించి మఱల భోజకుమారసహితుండై ప్రవేశించుచున్నాఁడు.]

భోజ.—[మనస్సులో] ఈవత్సుఁడు నాకొకభృత్యుఁడు. వీఁడు నన్ను బిలిపింప నేపాటివాఁడు? జయంతుని బిలిపించినప్పుడే నాకవ

మానకరముగఁ గానిపించినది. ఇప్పుడు నేను రాకుందును గాని మాయుపాధ్యాయులు పిల్వఁబట్టి వచ్చితిని. నేను వచ్చినంత మాత్రమున వీనికిఁ జేసిన గౌరవ మేటిది? వీఁడు చేసినపనికి వీనికిఁ దగినసత్కారము జేసి వీనియందు నాకుఁగలగౌరవము వెల్లడించెదను. [కోపముతో మండిపడుచుఁ గన్ను లెఱ్ఱఁజేసి వత్సరాజుతో] ఓరిపాపీ! యెవఁ డిచ్చినాఁడురా నీ కీశక్తి, రాజునకు ముఖ్యకుమారుఁడనైన నన్నొంటిగా రాజమందిరమునందుండి వెలుపలకుఁ బిలిపించుటకు? [అని యెడమకాలిచెప్పుతో వత్సుని లెంపకాయ కొట్టుచున్నాఁడు.]

వత్సు.—యువరాజా! యిది రాజాదేశము మనము భువనేశ్వరీవనమునకుఁ బోవుదము రథం బెక్కుము.

[ఉభయులును రథమెక్కి నిష్క్రమించుచున్నారు.]

---

# భోజకుమారము

## ద్వితీయాంకము.

---

రంగము - భువనేశ్వరీవనము.

వత్సరాజు నన్న బుద్ధిశాలి ప్రవేశించుచున్నాఁడు.

బుద్ధి.—రాజు నానతిచేత భోజకుమారుని వధింప నివ్వనంబునకు నా తమ్ముఁడు వత్సుఁడు భోజకుమారసహితుండై వచ్చుచున్నాఁ డని విని వానికడంక యుడుపఁగోరి యతివేగంబున వచ్చితిని. వాఁడింకను రాఁడయ్యెఁ గారణంబేమొకో! వాఁడు వచ్చునంతకు నియ్యడవింగలవింతలను జూచెదను. [అడవిలోని వృక్షములవంకఁ జూచి యాశ్చర్య మభినయించి] ఓహో యేమి యీయడవి భీకరాకారము! దట్టముగ నల్లికొన్న చెట్లచేత మిన్ను కానఁబడదయ్యెను. దట్టముగఁ బయికిఁ బెరిగిన గడ్డిచే మన్ను గానఁబడదు సరియకదా నాయొడలు నాకే గానఁబడదయ్యె. నడువఁ ద్రోవగానము [ఆకాశమువంకఁ జూచి మఱలఁ దలవంచి] ఓహో సూర్యరశ్మి యొక్కింతయినఁ గానఁబడదు.

సీ. వేయుచేతు లటంచుఁ బేరుమాత్రమె కాని
కానరా దొకచేయి యైన రవిది
మిన్నుమానిక మంచు మిన్నవేరే గాని
మినుగాని మణిగాని కనఁగరాదు
దిననాయకుం డంచు వినికిమాత్రమె గాని
దినమేదొ రేయేదొ తెలియరాదు
కర్మసాక్షి యటంచుఁ గరము పల్కుటె గాని
తరణితా నక్షిగోచరుఁడుగాఁడు

తే. కావునను సూర్యదేవుండు కలఁడొ లేఁడొ
కలఁడ యేనెందు నెట్టులేకాలమందుఁ
గలఁడొ మానిసి యగువాఁడు తలఫునందు
నైన నెఱుఁగంగ నేరఁడీ యడవిలోన. 1

[కొన్ని యడుగులు నడిచి ముందఱ జూచి] అల్లదె యా చాయను మిట్ట యొకటి కనఁబడుచున్నది. అందుపోయి నిల్చెదను. [కొంచెము దూరము నడిచి పర్వతముఁజూచి] ఓహో యేమి యీ పర్వతము భీకరాకారము!

సీ. పాంథులపై డొల్లి పడుదుము మేమంచు
జడిపించు బలుగండశైలములును
మదపుటేనుంగుల పదములయొత్తులఁ
దగ నుబ్బి స్రవియించుధాతురసము
బెబ్బులుల్ సింహముల్ బొబ్బరించుచుఁ బైకి
నెమ్మిరాఁగఁ బ్రతిధ్వనించు గుహలు
ఘనవాతములఁ దరుస్కంధఘట్టనఁబుట్టి
కడుఁబ్రజ్వరిల్లెడు కాఱుఁజిచ్చు
తే. వెలయ నాకాశ మనువిష్ణువేరురమ్ము
నొఱయు భూదేవి చన్మొనలో యనంగఁ
జెలఁగి పెరిగిన యెత్తైన శిఖరములును
నమరి గంభీరభీషణం బయ్యెఁ గొండ. 2

ఇంక నిబ్భయంకరమైన తావున నుండనోప. [కొంచెము నడిచి] ఓహో యిక్కడనైన నగ్ని చెలఁగి వాయువు తోడుసూప వనంబెల్ల దగ్ధము చేయుచున్నవాఁడు.

ఉ. ఊరుచుఁ బెద్దయై వికసితోజ్జ్వలనూత్నకుసుంభపుష్పసిం
దూరపుఁ జాయ గాంచి పవనుండు రయోద్ధతిఁ దోడుసూపఁగా
భూరిలతాళిశాఖలను భూజముఖంబులఁ గౌఁగిలించి వే
ధారుణిఁ బావకుం డకట దగ్ధము చేయుచు నున్నవాఁడహో. 3

ఇక్కడ నేనుండనొల్లను మఱియొకచోటికిఁ బోయెదను. [కొంచెముదూరము నడిచి] అల్లదె యావంకకొలనును దానియొద్దున

నొక పెద్దమఱ్ఱిచెట్టును దానిసమీపంబున దేవాలయంబును గానంబడు చున్నవి. అందుల కేగి నాతమ్ముఁడు వచ్చుదాఁక నచ్చెట్టుక్రింద విశ్రమించెదను. [అట్లుచేసి చెవియొడ్డి.]

చ. అదె వినవచ్చెడుం గడుభయంకరమౌ రథనేమినిస్వనం
బదె కనవచ్చెడుం రథహయంబులు క్రిందను గాలుపెట్ట క
ల్లదె కనవచ్చెఁ దా నురథ మంతయు సారథిముఖ్యయుక్తమై
యిదె దిగెఁ దేరు వత్సుఁడు మహీపతిపుత్రసమేతుఁడై యిటన్. 4

[అంతటఁ బయిని జెప్పినరీతిని భోజకుమారసహితుఁడై రథము డిగి వత్సుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వత్స.—[బుద్ధిశాలికి నమస్కరించి] అన్నా యిదె నమస్కరించుచున్నాను.

బుద్ధి.—చిరంజీవ! చిరంజీవ!

వత్స.—ఇందుల కెట్లు వచ్చితివి? నిన్నెవ్వరు తీసికొనివచ్చిరన్నా?

బుద్ధి.—నీవే తీసికొనివచ్చితివి వత్సా!

వత్స.—[ఆశ్చర్య మభినయించి] నేనా?

బుద్ధి.—ఔను.

వత్స.—[మనస్సు కలఁగి తొట్రుపడి మరలఁ దెలివి దెచ్చికొని తనలో] ఆహా! తెలిసినది. నాప్రవర్తనము తన్ను దీసికొనివచ్చినదని వీనిభావము. నాచేయఁబోవుకృత్యము వీనికి వెల్లడియయ్యెను. ఇప్పుడు వీనిని జొమ్మనుట లగ్గుగాదు. [ప్రకాశముగా] అట్లయిన నాతో నుండుమన్నా!

బుద్ధి.—మంచిది.

వత్స.—[ప్రక్కకుఁ దిరిగిచూచి యాశ్చర్య మభినయించి] ఔరా యేమి యీమఱ్ఱిచెట్టువైశాల్య వైభవము!

సీ. దీని రెమ్మలపిండు తిలకించి చూడఁగా
 నడవియెల్లను నిదే యయ్యెఁ జుమ్మి
దీని కొమ్మలసంఖ్య తిలకించి చూడఁగా
 నన్నిదిక్కులు నిదే యయ్యెఁ జుమ్మి

దీని నీడలుపాఱు దివ్యస్థలము చూడ
నవనియెల్లను నిదే యయ్యెఁ జుమ్మి
దీని పశ్చాశ్రయమైన పఱుపుచూడ
నభ్రమెల్లను నిదే యయ్యెఁ జుమ్మి
తే. యనఁగ నొప్పారి యొత్తయి యారఁబండి
నట్టిపండులచాయలు నాకు చాయ
లెనసి యింద్రధనుఃకాంతి యొసఁగ మెసఁగ
మహిమ వెలిఁగెడు నీపెద్దమఱ్ఱిచెట్టు. 5

బుద్ధి.—కొంచెము సే పీమఱ్ఱిచెట్టునీడను విశ్రమింపుఁడు. [వత్సుఁడును భోజకుమారుఁడునుగూడఁ గూర్చుంచున్నారు.]

వత్స.—[దిగులు మొగమువైచికొని మనస్సులో] నే నీచిన్నవానితో నేమని చెప్పుదును? నాకు మాటాడ నోరాడదు ఇప్పుడు నాచేయఁబోవు ఘోరపాపకృత్యమునుబట్టి నన్ను జూడఁగూడదని యసహ్యాపడినవాఁడువోలె సూర్యుఁడు పడమటికొండచాటునకుఁ బోవుచున్నవాఁడు. ఇంక నొక జాము మాత్రము నాకు గడువుగలదు. ఈజాములో వీనిశిరస్సును రాజునకుఁ జూపవలయును. అట్లుగాకున్న నాశిర మెగురును. ఇప్పుడు నావచ్చినపని యీముద్దుబాలకునితో నెట్లు చెప్పుదును? చెప్పక తీరదు. కావున నన్యాపదేశముగా మాటలాడెదను. [ప్రకాశముగా భోజునితో] రాజకుమారా యువరాజా!

చ. మనమునఁ గొంచెమేనియును మంచియుఁ జెడ్డయుఁ జక్కఁజూడ కీ
వనమున నిప్డు వీఁడు కడుఁబాపపుఁగృత్యము సేయ నున్నవాఁ
డనినను నేవగించి చనెనా యనునట్టుల పశ్చిమాద్రిచాఁ
టున కదె లోకబాంధవుఁడు డొల్లెను బంతియవోలెఁ జెచ్చెరన్. 6

తే. కాని పనిచేసి నే నోడిఁగట్టఁ దలఁచి
నట్టిపాపము ముద్దయై యకట నన్ను
జుట్టుముట్టినదో యనుచొప్పుపోఁపఁ
జిమ్మచీఁకటి యెల్లెడఁ గ్రమ్మె నిపుడు. 7

భోజ.—ఈవర్ణన లేమిటికి నీకు మాపినతండ్రి యాజ్ఞాపించినపని యెద్దియో వేగమ చెప్పి చేయుము వత్సా!

బుద్ధి.—[భోజకుమారునితో] భయపడకుము భయపడకు మాయు ష్మంతుఁడా!

భోజ.[కోప మభినయించి] భయమా! నీవు తారతమ్య మెఱుఁగక మాటలాడుచున్నావు బుద్ధిశాలీ మముఁబోటిరాజకుమారులకు భయమన్నమాట చెవినిబడఁగూడదని యెఱుంగవే?

బుద్ధి.—[మనస్సులో] ఏమి వీనిధైర్యము!

ఆ. ఇట్టి ధైర్యమహిమ హిమవంతునకు లేదు
ధైర్య మెల్లసంపదలకుఁ బుట్టి
నిల్లు నిదుమకడలి యీాదంగ మేల్ తెప్ప
గాన చేటులేదు వీని కెందు. 8

[ప్రకాశముగా] క్షమియింపుము క్షమియింపుము యువరాజా! మఱియేమియుఁ గాదుగాని యీావత్సుఁడు నీకొక యప్రియవాక్యము పలుకఁబోవుచున్నాఁడు.

వత్స.—[తలవాంచికొనుచున్నాఁడు].

భోజ.—బుద్ధిశాలీ! నన్నీతఁ డిటఁ దెచ్చినప్పుడే యెద్దియో విరుద్ధ కార్యము జరగునని యెఱిఁగితిని. దీని కింత సంశయింపనేల? యిదియేటి దోసఁగు?

తే. అప్రియంబన నేటికి నక్కట ప్రియ
మనఁగ నేటికిఁ బ్రియ మప్రియమును రెండు
దైవగతి వచ్చుచుండును ధరణిలోనఁ
గాక మానిసి తానేటి కర్త యగును. 9

అదియునుంగాక,

క. ఇది ప్రియమని ధర నప్రియ
మిది యని మది నిర్ణయింప నెట్లగు మనకున్
మది నప్రియమని తలఁచిన
యది ప్రియమగుఁ బ్రియమటన్న యది యప్రియమా. 10

మఱియును,

ఆ. దైవగతిని వచ్చుదానిని దేని నే
వలదు కీడటంచుఁ దలఁప మనము
దైవ మెపుడు మనలఁ దల్లిదండ్రులవోలె
నుర్వి నరసి ప్రోచుచుండుకతన. 11

వత్సరాజుతో కానిమ్ము సందియమేల వత్సా!

వత్స.—[దుఃఖ మభినయించి మనస్సులో] ఇప్పుడు నేనెట్లు చెప్పుదును? చావు కబురు చల్లగఁ జెప్పుమన్నారు. కాఁబట్టి ముందఱ రాజు నాజ్ఞ చెప్పను. [ప్రకాశముగా] కుమారా! నేఁటియుదయమున మనయాస్థానమునకు వచ్చిన జ్యోతిష్కుఁడు నీవు మహైశ్వర్యవంతుఁడ వగుదువని చెప్పినవాఁడు.

భోజ.—అది నేనెఱుఁగుదును నే నక్కడనుండగానె చెప్పినాఁడు.

వత్స.—

ఆ. ఐదు పదులు నైదు నగువత్సరమ్ములు
మూఁడునాల్గునెలలు మూఁడునాళ్లు
దక్షిణాపథంబు తగ గౌడతోఁగూడ
భోజరాజుచేత భోజ్యమగును. 12

భోజ.—[మనస్సులో] యాచింపవచ్చినప్పుడును మిత్రద్రోహ మాచరింపవచ్చినప్పుడును స్తోత్రముచేయుట సహజము. కోప మభినయించి ప్రకాశముగా] ఇచ్చుట నన్నాశీర్వదింపవచ్చితివె వత్సా!

వత్స.—[కన్నీరువిడిచి] కాదు కాదు కొలువుకూటమునుండి నీవట్లు పాఠశాలకుఁబోయినపిమ్మట నాజ్యోతిష్కుఁ డిట్లు చెప్పినాఁడు.

భోజ.—చెప్పిన నేమి?

వత్స.—[గద్గదస్వరముతో] చె-చె-చె-చెప్పినమీఁదట [గద్గదస్వరముతో] స-స-స-సహింపలేక [గద్గదస్వరముతో] మీ-మీ-మీ-మీపినతండ్రి—

భోజ.—[తలపంకించి] చాలుఁ జాలుఁ దెలిసినది. ఇఁకఁ జెప్పనక్కఱ లేదు. గడు వెప్పటికి వత్సా!

వత్స.—ఈరాత్రి తొలిజాము చివరదాఁక.

భోజ.—[తలపంకించి] ఔరా లోభ మెంతపనిచేయును! పిత్రార్జితమైన నారాజ్యమున కాశించిగదా మాపినతండ్రి నన్నుఁ జంప సమకట్టినాఁడు!

తే. లోభమునఁ బుట్టు ద్వేషంబు లోకమందు
అల్ల ద్వేషంబునను బుట్టు నధికమైన
క్రోధ మలక్రోధమునఁ బుట్టు ద్రోహబుద్ధి
ద్రోహబుద్ధియ పురిటిల్లు దురితములకు. 13

ఆ. తల్లినైనఁ దనదు తండ్రినైనను గూఁతు
నైన ముద్దుఁగొడుకు నైన గురువు
నైనఁ దోడఁబుట్టు నైన నెచ్చెలి నైన
లోభి చంపఁ జూచు లోకమందు. 14

తే. పుడకలం బెట్టినను బుట్టెఁ బుట్టుగుణము
పోవదనుమాట పెఱగుణంబులయెడలను
వమ్ముగును గాక లోభగుణమ్మునెడను
వమ్ముచేయంగఁ దరమానె బ్రహ్మకైన. 15

ఇట్టి యాశకుఁ గారణం బేమి వత్సా నీవు చెప్పినజ్యోతిష్కుఁడు మాయాజ్యోతిష్కుఁడు కాఁడుగదా? మాపిన్నయమ్మ యెవ్వనికేని వేషము వేయించి యట్లు పంపదుగదా! నాకంటె వయస్సునందుఁ బెద్దవాఁడయినను జయంతునికి నాకంటె విద్య తక్కువయని యింతకుమున్నె యాయమ నామీఁద నీర్ష్య దాల్చినదని విన్నవాఁడను. జయంతునిమిత్రులు వానికి రాజ్య మిప్పింపఁ గోరి నన్నుఁ జంపుటకు మాపినతండ్రికి బుద్ధిపుట్టున ట్లనామక లేఖలు వ్రాసియుండరుగదా! ఓర్వలేమిచె నట్టిలేఖలు వ్రాయుదురాచార మిప్పుడు ప్రబలుచున్నది.

బుద్ధి.—అనామక లేఖలవలన నంత యాపదవుట్టునె కుమారా?

భోజ.—నే నయిదేండ్లబాలుఁడనయినను మాపినతండ్రికి వచ్చు వ్యావహారిక లేఖ లప్పుడప్పుడు చూచుచుండుటచేఁ బ్రపంచ

స్వభావము కొంచె మెఱింగినవాఁడను. ఈనడుమ నొకచిత్ర కథ జరిగినది చెప్పెదను విను.

వత్స, బుద్ధి.—సావధానులమై యున్నాము.

భోజ.—మనపట్టణన్యాయాధిపతిమీఁద నొకమహానుభావుఁ డనామక లేఖలు కొన్ని వ్రాసి మన పెద్దమంత్రికిఁ బంపినవాఁడు. ఆ లేఖలలో వ్రాసినవిధ మెట్లంటేని.—

"ఈన్యాయాధిపతి లంచగొండి. తెలివిమాలినవాఁడు. జనవిరోధి. వీని నుద్యోగమునుండి తొలఁగింప కుంటివేని నీశిరస్సు ఖండించెదను." అని యున్నది.

వత్స, బుద్ధి.—ఆన్యాయాధిపతి దుర్మార్గుఁడా యేమి?

భోజ.—ఆతఁడు సజ్జనాగ్రగణ్యుఁడు. ఆయన,

సీ. లక్షాధికారినే భిక్షాధికారినే
నేకరీతిగఁ జూచి యెసఁగువాఁడు
తప్పుచేసినవారి దండించుచో నోరు
మెదపక నమ్రుఁడై మెలఁగువాఁడు
ఒకకాలు నిప్పులో నొకటి చందనములో
నుంచి నెమ్మి వ్యవహరించువాఁడు
పరభామఁ బరధనం బరయ నొల్లనివాఁడు
నత్యంతవశ్య వాక్యైనవాఁడు
గీ. నాఁడువారికి మగవారి కవనిలోన
భేద మించుక యెంచక ప్రేమతోడ
సమమయినరీతి మర్యాద సలుపువాఁడు
వినయవిద్యావిభూషల వెలయువాఁడు. 16

బుద్ధి.—శ్రీహరీ! యిట్టిమహాపురుషునియెడఁ దప్పుఁజూచిన యాదుర్మార్గుఁ డెవఁడు?

ఆ. వానినోరుపడదె వానికన్నులు దిగఁ
బడవె తట్టుగాలిఁబడదె చేయి?
వానివిడిచిపోరె వాగ్దేవి లక్ష్మియు?
వాఁడు పోఁడె యింక వసుధనుండి?. 17

భోజ.—నీవు వాని శపింపకు బుద్ధిశాలీ!

బుద్ధి.—ఏమి వాఁడు సన్మార్గుఁడా?

భోజ.—ఎట్లంటేని వినుము.

తే. రావణుఁడు సీతఁ గొనకున్న రాజరాజు
పాండవాగ్రజుభంగము పఱుపకున్న
ధరణిసుత పతివ్రత యౌట ధర్మసుతుఁడు
మదిఁ దగవు దప్పమియు లోకవిదిత మగునె? 18

చ. అనుపమనీతియుక్తుఁ డయినట్టిమహాత్ము విరోధు లెన్నఁడే
ననయములాడిరేని యవియల్ల మహాత్మునికీర్తితోంటికం
టెను గడుఁజక్కఁగాను బ్రకటించును జుమ్మిల దర్పణంబు మీఁ
దను గడుబూదిరాయ నది దానిని శుభ్రము చేయునట్టులే. 19

బుద్ధి.—అట్లయిన నాకుటిలాత్ముని నడవడిచే మనన్యాయాధిపతికి మేలు కలిగినదా యేమి?

భోజ.—నిస్సందేహముగా.

వత్స.—ఎట్లు కుమారా?

భోజ.—పెద్దమంత్రి సజ్జనులకు దుర్జనులను వివక్షచేయుటయందు మిక్కిలి నేర్పరియును సత్పురుషపక్షపాతియును నైనను నద్దుర్మార్గుఁడు వ్రాసినలేఖ చిన్నమంత్రికిఁ బంపుటయుఁ జిన్నమంత్రి నిజము తెలిసికొని పెద్దమంత్రి పేర వ్రాసినవాఁడు.

వత్స.—ఏమని కుమారా?

భోజ.—న్యాయాధిపతి సుగుణసంపత్తిగలవాఁడనియు నువదాశుద్ధుఁడనియు మనదేశంబునంగల తోడిన్యాయాధిపతులకంటె విశేషవిద్వాంసుడనియు బుద్ధిమంతుఁడనియు ననామక లేఖ వానివిద్యకును దేజమునకు నోరువలేక వానిపదవి కాశించిన యొకతులువ యగువైరి వ్రాసెననియు వ్రాసినవాఁడు.

బుద్ధి.—ఆపలుగాకి యట్లనామకలేఖలు వ్రాయుటకుఁ గారణమేమి కుమారా?

భోజ.—ఇప్పుడు మాపినతండ్రి నన్ను దలనఱకుమని నీకాజ్ఞయియ్యఁ గారణమేమి వత్సా?

వత్స.—ఓర్వలేమి.

భోజ.—అదియే కారణము.

బుద్ధి.—మఱి యాన్యాయాధిపతి యాదుష్టాత్ముని శిక్షింపఁబూనఁడె?

భోజ.—సజ్జనులకు దీర్ఘక్రోధములు లేవుగదా బుద్ధిశాలీ! ఆతని నే నడిగినప్పుడు

క. కర మపవాదము లిడి స
త్పురుషులఁ దిట్టెదరు తుచ్ఛపురుషులు పాపం
బరయంగఁ గట్టికొం డ్రా
పురుషులు పడువారు ముక్తపురుషులు సువ్వే. 20

అనుధర్మము నాలోచించి తానెంతమాత్రమును జింతింపక నిర్మలాంతఃకరణుండ నైయున్న వాఁడనని నాతోఁ జెప్పినవాఁడు.

వత్స.—అట్లయిన నప్పాపికి శిక్ష లేదా యేమి?

బుద్ధి.—ఉండక మానదు.

భోజ.—

తే. పరులకులగోత్రసౌఖ్యసౌభాగ్యవీర్య
రూపసత్కారధనముల యేపుఁ గాంచి
యోర్వలేకుండువాఁ డెవ్వఁ డుర్వివాఁడు
మందు లేనట్టి వ్యాధిచేఁ గుందుచుండు. 21

ఈకారణంబుచే నిహమందు వానికి రాజదండనము లేకుండినను జింతింపఁ బనిలేదు.

వత్స.—అట్లయిన మీపినతండ్రికిఁగూడ నివ్వ్యాధి కలుగకమానదు?

బుద్ధి.—దానికి సందేహమేమి?

భోజ.—మనము కర్తవ్యాంశము విడిచి మిక్కిలి దూరముపోయితిమి వత్సా! ఇంక నీవు మాపినతండ్రియాజ్ఞ సలిపి వేగమ యాతనికిఁ బొడసూపుము.

బుద్ధి.—నీవిట్లు పలుకుట పాడిగాదు కుమారా!

భోజ—3

భోజ.—ఏమి బుద్ధిశాలీ పాడిగానిమాట నానోటఁ బలుకుదువే?

ఆ. ప్రకృతిజనములకును బరికింప మదిలోనఁ
బాడి యగుచునున్నఁ బాడిగాక
యున్న రాజు నాన యొప్పుగాదటు విత
ర్కింపకుండఁ జేయఁ గింకరులకు. 22

వత్స.—చిరంజీవి న్యాయ్యము చెప్పినాఁడు.

బుద్ధిశాలి.—

మానినీవృత్తము.—

న్యాయము లట్టులయుండియు నిభ్భువనంబున బోధను లారయ న
న్యాయములై చనుఁ గొన్ని క్రియల్ మఱిన్యాయములై చను
నన్యము లన్యాయము లట్టుల యుండియుఁ గావున నారయ
న్యాయము లియ్యవి యన్యాయము లియ్యవి నిక్కము సువ్వే
యనంగను మిక్కిలి దుష్కరమా. 23

ఇందు న్యాయమేది? రాజు నాజ్ఞ చేసితివేని యీపాపము నీ మెడకుఁ జుట్టికొనకపోదు. నీ వొక్కసారిపోయి రాజునకు మఱల విన్నవించిరమ్ము.

భోజ.—వలదు వలదు.

వత్స—[భోజునితో] కుమారా మీపినతండ్రితోఁ జెప్పవలయు మాటలెల్లఁ జెప్పినవాఁడను. నామాటలు వానిని జెవిటి వానిని జేసె నేమిచెప్పుదును దండ్రీ!

భోజ—అవును.

బుద్ధి—[వత్సునితో] చివరకు నీవేమి చెప్పితివి? అతఁ డేమనియె? చూతము చెపుమా!

వత్స—[భోజునితో] త్రిలోకాధినాథుం డగురామునిపట్టాభిషేకమునకు బ్రహ్మపుత్త్రుఁ డగువశిష్ఠుడు ముహూర్తంబుపెట్ట నమ్ముహూర్తమున రామునకు రాజ్యమురాదు సరియకదా మీఁది మిక్కిలి యిల్లును వాకిలి విడిచి యడవులపాలయిపోయి యాతఁడు సీతను గోలుపోయెను. అట్టిచో

తే. నీదు దయగోరి తనపొట్ట నింపికొనఁగ
వచ్చిన నరాధమునిమాట పొచ్చె మనక
లోభమున నీదు ముద్దుబాలుని గటకట
చంపుమన నెట్లు నోరాడె జనవరేణ్య. 24

అని నేను మీపినతండ్రితో భృత్యత్వము విడిచి చెప్పితిని కుమారా!

భోజ.—మూర్ఖులమనస్సు రంజింపరాదు నే నెఱుఁగుదును.

తే. కారణం బొప్పి యొప్పరు కార్యమపుర
గార్య మొప్పియు నొప్పరు కారణంబు
కార్యకారణముల నొప్పి కార్యఫలము
లకట మూర్ఖులు తా మొప్ప రవనిలోన. 25

బుద్ధి.—[వత్సునితో] అట్లు చెప్పఁగలిగితె వత్సా?

వత్స.—[బుద్ధిశాలితో] కృత్యము నిషిద్ధకృత్యమును సల్లాపము రహస్య సల్లాపమును గాన నేనెంతమాత్రమును భయములేక నెచ్చెలితోవలె రాజుతో మాటలాడితినన్నా!

భోజ.—[బుద్ధిశాలితో] అది సహజము బుద్ధిశాలీ.

తే. కానిపని యని యొడయఁడు మానసంబు
నం దెఱింగియు నదిచేయుమని యవేళ
లెంక కేకాంతమాడిన జంకుగలిగి
జంకునే లెంక మాటాడ శంకయేల? 26

బుద్ధి.—అది యుక్తమాయుష్మంతుఁడా!

వత్స.—దానిమీఁద నీవు రాజవు నేను సేవకుఁడను వత్సా యని కోపముతో బలికి యీపాపము పొరయకుండ నన్ను రక్షింప యత్నించినాఁడు.

బుద్ధి.—అట్లుచేసిన బాగుండునుగదా!

భోజ.—[బుద్ధిశాలితో] అట్టిది కోరవలదు బుద్ధిశాలీ! నడుమ మంత్రసాని గండ మేటికి?

వత్స.—[భోజకుమారునితో] కుమారా ప్రొద్దుపోయినది. మన మీమాటలసందడిని మనవచ్చినపని మఱచితిమి.

భోజ.—రాజాజ్ఞ వితర్కించుట నామతముగాదు వత్సా!

బుద్ధి.—[భోజునితో] ముంజుఁడు రాజకుమారా! మీతండ్రి సింధులమహారాజు తాను స్వర్గమునకుఁ బోవనున్నయవసరమున నీవు బాలుఁడ వగుటఁజేసి రాజ్యలక్ష్మీభారమును మోవఁజాలిన నీపినతండ్రి కియ్యకున్నఁ దనకుఁ లోకాపవాదము వచ్చుననియు నొకవేళ నీకిచ్చినను విషాదులచే నిన్నాతఁడు చంపుననియు దానిచే రాజ్యము రిత్తవోవుననియుఁ బుత్రహీనియు వంశొచ్ఛేదంబును గలుగుననియు భయపడి రాజ్యము తమ్మునికిచ్చి పట్టాభిషేకకాలమునందు మిక్కిలి నేర్పుతో నిన్నాతనితొడమీఁదఁ గూర్చుండఁబెట్టినాఁడు.

వత్స.—అది నిజము.

బుద్ధి.—[భోజకుమారునితో] దానిచే నిన్ను రాజునుజేసి ముంజుని నీబాల్యంబున వ్యవహరించుటకు రాజప్రతినిధిని జేసినట్టు లర్థముగాని మఱియొకటి కాదు

వత్స.—[బుద్ధిశాలితో] రాజయినను రాజప్రతినిధియయినను నొక్కఁడే. వారల కభేదము. కొందఱు ప్రజలు వారికి భేద మెంచి ప్రతినిధిని నిరసించెదరు. అట్టివారు పండితంమన్యులుగాని పండితులుగారు. కావున నీవింక నడ్డువాటులు వేయకుమన్నా!

భోజ.—వత్సుఁడు న్యాయము పల్కినాఁడు.

బుద్ధి—ఇందు న్యాయ మేదికుమారా? అకారణముగఁ గొడుకును దండ్రి చంపుటయును బ్రజలను రాజు చంపుటయును న్యాయములయ్యెనే నిందు న్యాయము గలదు. కపటద్యూతమునఁ బాండవులరాజ్య మపహరించికొన్న ధృతరాష్ట్రుఁడా జూదపుప్రతిజ్ఞచొప్పున వారు పదుమూఁడేఁడు లరణ్యాజ్ఞాతవాసములు సలిపి మరలఁ దమరాజ్యము తమకిమ్మని దూతముఖంబున నడుగుటయు నియ్యనొల్లక కయ్యమున గెల్చి రాజ్యముకంటె నంధకవృష్ణిరాజ్యములలో బిచ్చమెత్తికొనుట

మేలని ధర్మరాజునకు సంజయునిచేతఁ బంపినరాయబారమం దెంతన్యాయమున్న దిందంతన్యాయము గలదు.

భోజ.—[బుద్ధిశాలితో] పలుఁబలుకులేల బుద్ధిశాలీ చంపుటకును బుట్టించుటకును మనుష్యుఁడు కర్తగాఁడు. పూర్వకృతము ననుసరించి శుభాశుభంబులు నరునకు వచ్చుచుండును. మనము మాపినతండ్రిని దూఱనేల యీవత్సుని దూఱనేల ? అదియునుగాక జననమరణంబులు దేహంబునకుఁగాని దేహికిఁ గావు. దేహి నాయుధములు ఛేదింపఁజాలవు. నిప్పు కాల్పఁ జాలదు. నీళ్లు చివికింపఁజాలవు. గాలి యింకింపఁజాలదు. దేహి నిత్యుఁ డచలుఁడు సనాతనుఁడు సర్వగతుఁడు.

చ. పురుషుఁడు చచ్చువాఁ డనెడుపూరుషుఁడుం బురుషుండు చంపున
న్పురుషుఁడు నిర్వ్యరుం దలఁప బుద్ధినిధీ కడుమూఢులైనవా
రరయఁగఁ జావఁ డొడ్డులను నక్కట చంపఁడు నొడ్లచేతనుం
బురుషుఁడు చంపనుంబడఁ డమూల్యరహస్య మెఱుంగు దీనినిన్.27

వత్స.—ఆయుష్మంతుఁడు చెప్పినమాట యథార్థము.

బుద్ధి.—[చటాలున లేచి కంఠోక్తిగా] అది నిజము [వత్సరాజు చేతిలోనికత్తి లాగికొని వాని మెడమీఁది కెత్తిపట్టి] వత్సా! యిదె నీమెడ నఱకెదను.

భోజ.—[చిఱునవ్వు నవ్వుచున్నాఁడు.]

వత్స.—[వడవడవడఁకుచు గద్గదస్వరముతోఁ జేతులుజోడించి] ఇది యేమన్నా యిట్లు పలుకుచున్నావు ?

బుద్ధి.—ఇది నాదోషముగాదు.

వత్స.—మఱియెవ్వరిది ?

బుద్ధి.—నీది.

వత్స.—ఎట్లు.

బుద్ధి.—లోకంబున శుభాశుభములు పూర్వకృతము ననుసరించి వచ్చును గావున నీకర్మమును నీవు నిందించికొమ్ము. అదియునుగాక నీమెడ నశించును గాని నీయాత్మ నశింపదు. దీనికి భయపడనేల ?

వత్స.—[మెడకు బట్టచుట్టికొని బుద్ధిశాలిపాదములకు సాష్టాంగదండప్రణామము సలిపి] శరణార్థిని గావుమన్నా! [లేచి నిల్చుండి] నీభావము నాకు బోధపడినదన్నా ఫలము దైవాధీనమయినను గార్యము పౌరుషముగాని యొండుగాదు నిజము.

భోజ—[చిఱునవ్వుతో] లక్షణముకంటె లక్ష్యము బలీయముగదా!

బుద్ధి—[వత్సునితో] ఇప్పుడు నాతో నేకీభవించితివిగావున నింక నేను జెప్పినపని జేయుము.

వత్స.—అది యేమిటిది?

బుద్ధి.—భోజకుమారుని గావుము.

వత్స.—ఎట్లు?

బుద్ధి.—మనస్సుగలిగె నేని మార్గము గలదు.

వత్స.—ఒకమార్గము చెప్పుము

బుద్ధి.—ముంజరాజుకంటె సింధులమహారాజు మన కనేకము లుపకారములు చిరకాలము చేసినవాఁడు ముంజుఁడు నిన్నగాక మొన్నవచ్చినవాఁడు.

వత్సు.—అవును నే నెఱుఁగుదును. అట్లయిన నేమి.

బుద్ధి.—సింధులునకు నీవు కృతజ్ఞత చూపవలయును.

వత్సు — నేను మానసైతిని.

బుద్ధి.—అట్లయిన భోజకుమారుని నాతోడఁ బంపి చిత్రకారునిచే నొకతల చేయించికొనిపోయి చూపి నీయాజ్ఞ నెరవేర్చితినని ముంజునితోఁ జెప్పుము. రాత్రియవుటచే నాతఁడు దాని నిరూపింపఁ జాలఁడు.

వత్సు.—[కోప మభినయించి గంభీరస్వనముతో] ఎట్టెట్టూ! నన్నబద్ధమాడుమనియెదవే? నేను మహావీరుఁడనని యెఱుఁగవె? నీచునివలె నబద్ధమాడుమనియెదె? అది నాకు దూరముగనుండుఁగాక! ఈపల్కులు పలికినవాఁడు నాయన్నగాకున్న వానిని నాకోపానలమునకు సమిథగఁ జేసెదను వింటె బుద్ధిశాలీ! [అని కత్తి జళిపించుచున్నాఁడు.]

భోజ.—[చిఱునవ్వు నవ్వుచున్నాఁడు.]

బుద్ధి—[ఉలికిపడి వత్సునితో] అది యట్లే?

వత్సు—అన్నివిధముల

బుద్ధి.—రాజాజ్ఞ తప్పైనను జేసెదనంటివి రా జబద్ధమాడుమనియె నేని యేమిచేసెదవు వత్స?

వత్సు.—బలిమిచే నన్ను బొంకింపనోపువాఁడొ దవెనేని యయ్యవస రమున నీరూపము దిగవిడిచి తొల్లి యెందుండివచ్చితి నందుల కేగెదను. ఇది నిశ్చయము.

భోజ.—[చిఱునవ్వు నవ్వుచున్నాఁడు].

బుద్ధి.—[మనస్సులో] ఓహో వీఁడు దేవతవలె నున్నవాఁడు. [ప్రకా శముగా] ఏల నీకు సందియమేల వత్సా! ప్రాణభీతి మొద లగుసమయములయందు బొంకాడవచ్చునని మనపురాణములు పలుకుచున్నవి.

వత్సు.—నేను శుద్ధమూఢభక్తుఁడను. నాకుఁ బురాణములు గిరాణ ములుఁ దెలియవుగాని మిన్ను విరిగి మీఁదఁబడ్డను గల్లలాడఁ గూడదని నామతము. ఇదితప్పని [తర్జనితో భోజునిఁజూపి] యీరాకొమరునిచే ననిపింపుము.

బుద్ధి.—[భోజునితో] ఏమి యీ యుష్మంతుఁడా మనపురాణములు ప్రమాణములు కావనియెదె?

భోజ.—నే నన్ను.

బుద్ధి.—అట్లని విశేషావసరముల నబద్ధము లాడవచ్చుననెదవు?

భోజ.—నే నన్ను.

బుద్ధి.—అదియెట్లు కుమారా?

భోజ.—ఏపురాణములు బొంకుమని చెప్పుచున్నవి బుద్ధిశాలీ?

బుద్ధి.—ఏపురాణము లననేల? పంచమవేద మనఁబరఁగిన భారతము నందే యున్నది.

భోజ.—ఎక్కడ? యేసందర్భమునందు?

బుద్ధి.—

"న నర్మయుక్తం వచనం హినస్తి న స్త్రీషు రాజన్న వివాహకాలే,
ప్రాణాత్యయే సర్వధనాపహారే పంచానృతాన్యాహురపాతకాని."

అని యున్నది.

భోజ.—ఉన్నదిగాని యీమాట లెవ్వ లెవ్వరితోఁ బలికి రెఱుఁగుదువె ?

బుద్ధి.—ఏమి! శర్మిష్ఠ యయాతిమహారాజుతోఁ బలికినది.

భోజ.—అట్లయిన నిది శర్మిష్ఠావాక్య మనుము. పౌరాణికునివాక్యము కాదు. గ్రంథంబులవచ్చు నయ్యైపురుషులవాక్యంబులు గ్రంథకర్తలవాక్యంబు లనందగునె ?

వత్స.—తగదు తగదు.

బుద్ధి.—ఏల తగదు ? గ్రంథకర్తలు తమయభిప్రాయంబులు తమగ్రంథములలోని పురుషులముఖంబులఁ దెలుపుదురు కాదె ?

భోజ.—[బుద్ధిశాలితో] 'తెలుపుదురుకాని యాయాయి పురుషుల ముఖంబుల నుంచుమాటలెల్ల గ్రంథకర్తల యభిప్రాయములు కావు. కవీశ్వరులు దుష్టుని బలికించునప్పుడు దుర్బుద్ధులును సజ్జనుని బలికించునప్పుడు సద్బుద్ధులును నయ్యాయిపురుషుల నోట నయ్యైకథాసందర్భంబులఁబట్టి పలికింతురుగాని యీరెండువిధములయిన పరస్పరవిరుద్ధబుద్ధులు గవీశ్వరునివనుట యసంగతము.

బుద్ధి.—సత్యము.

భోజ.—మహారాజు కూఁతురయ్యును విధివశంబునఁ దనతండ్రి పురోహితుని కూఁతునకు దాసియై చిరకాలముండి ఋతుమతియై కామమోహంబునఁ గుందుచుఁ దగినరాజన్యవర్యు నేకాంతంబున నాకస్మికమ్ముగఁ గనుంగొనఁగలిగి కామోపభోగంబులకై శర్మిష్ఠపలికినపలుకులు ధర్మములగునె ? దాని వాక్యంబులు విని ప్రతిజ్ఞాభంగము చేసిన దానికిఫల మామహారాజు తోడనె యనుభవింపఁడే ?

వత్సు.—ఆయుష్మంతుఁడు దివ్యపురుషుఁడు. [illegible]
పల్కునే!

భోజ.—[బుద్ధిశాలితో] ఇటు విను బుద్ధిశాలీ!

చ. పడమటికొండపైఁ బొడిచి భానుఁడు క్రమ్మరి సంజవేళలం
బొడుపు మహీధరంబుపయిఁ బొల్పుగఁ గ్రుంకెనయేని కొండలున్
వడిఁ జలియించెనేనియును బండ్లు జలంబుల నేల నోడలున్
నడచెనయేని యెన్నఁడును న్యాయము తప్పి వచింపఁ దీర్పులన్.

బుద్ధి.—ఆయుష్మంతునితో వాదము చేయ నేనేపాటి బుద్ధిశాలిని?

వత్సు.—[బుద్ధిశాలితో] అట్లయిన నాకు రాజాజ్ఞ నెరవేర్చుటతప్ప
వేఱు కర్తవ్యము లేదు.

బుద్ధి.—[నిట్టూర్పువిడుచుచు] హా! నేనేమి చేయుదును? నాకెట్టి
క్రూరకృత్యములు చూడవలయుట సంభవించెను. హా మాయ
దైవమ.

సీ. మంచివారలనెల్ల వంచించి మిక్కిలి
కష్టపెట్టఁగడంగ నిష్టపడుదు
చెడ్డవారలనెల్ల దొడ్డవారుగ నెంచి
పెక్కుసౌఖ్యము లిచ్చి పెంచు దీవు
లంచగొండులనెల్ల లాలించి యున్నత
పద మిచ్చి భూషింతు బహువిధములఁ
గరము పదాతీతవరులపైఁ గింక చే
వేమాఱు నిగిడింతు వేఁడిచూపు

గీ. దాతల దరిద్రులం జేసి ధనికులుగను
లోభులం జేసి మిగులఁ గుల్కుచు నెసంగు
దిట్టి నీచేష్టలం జేసి యెలుకపడియె
మాయదైవమవే నీవు మదిఁ దలంప. 

వత్సు.—[బుద్ధిశాలితో] అన్నా యింక నీవుండుము [దిక్కులుచూచి]
ఔరా చీఁకటి కాలుగ్రమ్మినది.

సీ. కంతస్వనమ్మునఁ గాకొండువిధమున
నెఱిఁగినవారినే నెఱుఁగరాదు
తడిమిచూచినఁగాక వడినిది యిది యని
యెఱిఁగినవారికే నెఱుఁగరాదు
కనుమూయఁ గనువిప్పఁగను ద్వైతి కద్వైత
మేకాని ద్వైత మిం తెఱుఁగరాదు
జారచోరులకెల్ల సంతోష మేకాని
యెదలోన సంకోచ మెఱుఁగరాదు
గీ. కోరి మిన్నులుకాటుకల్ గురియఁ జొచ్చెఁ
దాము కాఁబోలుఁ గాకున్న ధరణిలోన
మన్ను మి న్నేకముగఁ జేయుమాడ్కి వెలయు
నిట్టి చిమ్మచీఁకటి తొల్లి యెందుఁ గలదె? 31

[బుద్ధిశాలితో] అన్నా నాపని నెరవేర్పుట కిదియే సమయము గద!

ఆ. ఈకుమారుతోడ నిమ్మహామాయాభ
వనములోని కేగువాఁడ నిప్పు
డింక వగపుదక్కి యింటికిఁ బోవన్న
యిది యెఱుంగ నీకు మెవరినన్న. 32

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

# భోజకుమారము

## తృతీయాంకము.

రంగము - ముంజరాజు నంతఃపురములో నొకకూటము.

[తెరచాటున.]

వితానవృత్తము:—

తోలంగుఁడయ్యా వేగంబే
మెలంగుఁడయ్యా బిట్టార్తిం
గలంగుఁడయ్యా చిత్తంబం
దిలేశుం డార్త్యబ్ధిస్మగ్నెన్.

కటకటా రాజుగారును రాణిగారును బెద్దరాణిగారయిన సావిత్రీదేవియును బంధువులసహితము పుత్రశోకసముద్రములో మునిఁగియున్నవారు. వారు

ఉత్సాహ:—విన్ననైన యాననములు వెచ్చనైన యూర్పులుం
బిన్నగాని యేడ్పులుంగు వీడియున్నకొప్పులున్
ఛన్నమైన వైభవంబు సన్నమైన ధైర్యముం
బన్నుగాను గానిపింప వచ్చువార లియ్యదే. 1

[అంతటఁ బైనిచెప్పినరీతిని ముంజరాజును నాతనిరాణియగు సుశీలాదేవియును భోజకుమారుని తల్లియగుసావిత్రీదేవియును జయంతవిదూషకసహితముగాను జేటీజనసహితముగాను బ్రవేశించుచున్నారు.]

సావిత్రీదేవి:—[దుఃఖముతో.]

హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర
హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర
యెందుఁ బోయితి విప్పు డిందు రా వేర!
సుందరంబగుమోముఁ జూపవ దేర! 4

ఊఱితి నేమి పాపంబు సేసినదాన?
మఱిదప్పి నేనేడ్వ మాటాడవేర?
నీమొగంబును జూడ నేరనికంటఁ
దామరపూలెట్లు తగఁజూతు నేను?

నలి నీదుకన్నుఁ గానఁగ లేనికంటఁ
గలువఱేకే నెట్లు కానంగ నేర్తు?
నలినీదుమోవి గానఁగ లేనికంటఁ
లలితరసాలపల్లవ మెట్లు కాంతు?

ముద్దైన నీహస్తములు గానలేని
మొద్దుఁగంట నెఱతమ్ములఁ గాంతు నెట్లు?
నీ వీనుగనలేని నేత్రంబుతోడ
నేవిధంబునఁ గావ్యమే విప్పనేర్తు? *

వెలయ నీపలుకులు విననిచో నాకుఁ
జిలుకలపలుకులు చెవి నెట్లు చొచ్చు?
ముద్దులబాల నీముద్దు నెమ్మోము
ముద్దాడలేని నా మొద్దైనపెదవు

లక్కట యేనెట్టు లాడింప నేర్తు
నొక్కమాటయినను నొకమాట పల్క?
పరఁగని న్గౌఁగిలింపఁగ లేనిచేత
ధర నేమిపనిసేయఁ దనయ నే నేర్తు?

ఎలమి నీకును బువ్వ యిడలేనిచేత
నిల నేమిపనిసేయ నేనేర్తుఁ గొడుక?
కట్ట నీతల దువ్వఁగా లేనిచేత
బొట్టి యేపనిసేయఁ బుడమిలో నేర్తు?

బాల నీనోటిలోపలఁ బెట్టలేని
పాలిండ్లు నాకిలఁ బాపాలయిండ్లు

* వీనునకు శ్రీకార ముపమానము. కావ్యాదిని శ్రీకారముండును.

తండ్రి నిన్ గోల్పోయి ధర బ్రదుకంగ
గుండ్రాయి యటవె నాకును హృదయంబు? 32
నీతోడి దేసుమ్మినెటి నాకు లోక
మో తండ్రి యదిగాన నొప్పారనాదు
ప్రాణముల్ విడిచి నిన్నక్కట నాదు
ప్రాణమా చేరెద వచ్చి యిప్డిప్డ
హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర
హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర. 38

[అని యేడ్చుచు నేల మ్రొగ్గుచున్నది.]

ముంజరాజు:—[విదూషకునితో జనాంతికముగా] వాధూలా నాయొడలు వడఁకుచున్నది.

విదూ:—[జనాంతికముగా ముంజరాజుతో] మిత్రమా నీకొకయుపాయము చెప్పెదను వినుము నీవు కదలక మెదలక మూర్ఛవోయి నట్లు నిశ్చేష్టుఁడవై పడియుండుము.

ముంజ:—[మూర్ఛితుఁడువోలె నేలఁబడును.]

సుశీల:—[సావిత్రీదేవిని లేవనెత్తి తనకుఁ జేరఁగిలఁ బెట్టికొని కౌఁగిలించికొని] కడుపు దుఃఖము! చెప్ప నలవియా యమ్మా!

ప్రథమచేటి:—ఏమిబిడ్డమ్మా! కలువుదీటిసబిడ్డమ్మా!

ద్వితీయచేటి:—చాయచామనచాయయేగాని పున్నమచంద్రుఁడున్నట్టుండు వాఁడమ్మా!

తృతీయచేటి:—చాయలో నేమున్నదమ్మా? యెఱుపెఱుపందురుగాని యసలెఱ్ఱని వారిలోఁ జక్కనివారే లేరు.

ప్రథమచేటి:—ఆమాటకుఁ బడితేఁ జామనచాయ వారిలోనే చక్కని వారున్నారుసుమా!

తృతీయచేటి.—ఎఱుపుండఁగానే సరియా! రూపరేఖ లుండవలయును. కళాకాంతు లుండవలయును. అతనిమొగముఁ జూచితేఁ బున్నమచంద్రునిజూచినట్టు లాహ్లాదకరముగా నుండునమ్మా! ఆచిఱునవ్వు వెన్నెలలాగుననే యుండునమ్మా!

ద్వితీయచేటి.—మొగము చూచుటదాఁక నక్కఱలేదమ్మా. వాని మాట చెవినిబడఁగానే సంతోషము పుట్టునదమ్మా! అతఁడు కూటములోఁ గూర్చుండి పద్యములు చదువునప్పుడుగాని తోడిబాలురతో మాటలాడునప్పుడుగాని కిలకిలనవ్వునప్పుడుగాని పడుచులందఱు వెనుకసోరణగండ్లలో నుండియును దలుపుసందుల నుండియును జూచుచుఁ జెవులు దోరవెట్టికొని వినువారమ్మా యదేమి విచిత్రమోగాని వయస్సువచ్చినమీఁద నెట్లుండునోగాని

సుశీల.—[చేటులతో జనాంతికముగా] కొంచెమునే పూఁటకుండఁడు [చింత నభినయించి ప్రకాశముగా] లేదు! ప్రాప్తి లేదు! ఎవరేమిచేయుదురు. మనయత్న మనికొందుముగాని యిది యంతయు వట్టిదిసుమా యమ్మా!

ప్రథమచేటి.—అవునమ్మా, అవును.

సావిత్రీదేవి.—[ఉలికిపడు టభినయించి, చేటికల నుద్దేశించి దుఃఖముతో]

కొడుకుపోయె నటంచుఁ గోమలులార
చెడిదంపుఁ బలుకుచెప్పితి రేలమీరు!
వాఁ డాడికొనఁబోయె బాలురతోడఁ
గూడి యంచిపుడు నాకుం జెప్పరమ్మ.
వాఁ డేగెఁ జదువంగ బాలురతోడఁ
గూడి యంచిపుడు నాకుం జెప్పరమ్మ.
వాఁడు నిద్రించినవాఁడంచు మీర
లాడరమ్మా యిప్పు డకట నాతోడ.
మాటాడ రేలమ్మ మఱిమఱి మిమ్ము
బోటులారా దుఃఖముంబొంది వేఁడ?
యిది గర్వఫల మొకో యిలఁ జెలులార
యిది రాతిగుండెచే నెసఁగెడుఫలమొ!
కటకటా మిము దూఱఁగా నేల నాకుఁ
బటు సుఖమణులంచు భావింతు మిమ్ము!

ప్రత్యుత్తరం బీనవాచిక మాట
నత్యుత్తమస్థితి నాదరు మీరు. 16
నాయయ్య యింకేడ నాచూచుటేడ
నాయదృష్ట మిటుండ నాచేటులార !

[ముంజుని నుద్దేశించి దుఃఖముతో]

ఓయయ్య యోముంజ యోహో మఱింది
మాయయ్య జంపంగ మహి నేమిదొరకె? 2

[అని యురము బాదుకొని నేలకు వ్రాలుచున్నవి.]

ముంజరాజు.—అమ్మయ్యో [యని యులికిపడి లేచి మరల నేలఁబడు చున్నాఁడు].

విదూషకుఁడు.—[ముంజరాజుతో జనాంతికముగా] కదలవలదని నేను జెప్పితినిగదా నోరుమూసికొని శవమువలెఁ బడియుండుము నీ విక్కడున్నట్లు నీవదినెకుఁ దెలియఁగూడదు. ఆయమ దుఃఖమగ్నురాలై యున్నది. [అని ముంజరాజుశరీరము నొక చేతితో నొక్కిపెట్టి రెండవచేతితో వీవనపట్టికొని విసరు చున్నాఁడు].

సావిత్రీదేవి ? [మరల లేచి.]

దొరకొనె నీకు నోదొర తిలకింప
హరిహరీ యొకశిశుహత్యాపాపంబు
హరిహరీ యొకపుత్రహత్యాపాపంబు
హరిహరీ యొకరాజహత్యాపాపంబు
హరిహరీ యొకనరహత్యాపాపంబు
హరిహరీ ధర సర్వహత్యాపాపంబు
పూజ్యుండు నాథుండు భువినున్న యపుడ
రాజ్యంబు నీకు నర్పణ మాచరించె.
అభిషేకకాలంబు నప్పుడే పుత్రు
నభయార్థి యాచు నీయంకంబునందు. 12
నార్యపుత్రుం డుంచె నక్కట వాని
యార్యగుణంబైన నాదరింపవుగ

వదినె యంచును నన్నుఁ బరికింపవైతి
యిది యేకపుత్ర యంచెన్నంగవైతి.
పసిపాప యని పుత్రు భావింపవైతి
కసిపట్టి చంపి తత్కారణంబుగను.

[అని కనుఱెప్పలు వాల్చుచున్నది.]

సుశీల.—ఊఱడుమక్కా యూఱడుము. విధి యాలాగున వ్రాసిపెట్టినాఁడు. మన మేమిచేయఁగలము. నీవెఱుఁగని దేమున్నది. మీామఱఁదిగారు మూర్ఛిల్లి యెట్లు పడియున్నారో చూడుము. [తర్జన్యంగుష్ఠములతో తనగడ్డముపట్టికొని చేటులవంక దిరిగి యాశ్చర్య మభినయించుచు] ఆజ్యోతిష్కుఁ డెక్కడనుండి వచ్చెనమ్మా మాయజ్యోతిష్కుడు.

ప్రథమచేటి.—మాయజ్యోతిష్కుఁడే తల్లీ.

సావిత్రీదేవి.—[సీత్కారముచేసి కన్నులుతెఱచి దుఃఖముతో]

దైవజ్ఞ యెందుండి దయచేసితయ్య
యీాపు దర్శింపంగ నితరులు లేరె?
బ్రాహ్మణోత్తమ యిందు వచ్చి తేలయ్య?
జిహ్వాతరమ్ముగాఁ జెప్పి తేలయ్య?
పార్వతీదేవి శాపం బిచ్చె గాదె
పూర్వంబు మీాకెల్లఁ బుణ్యాత్మ? మీాకు
నిద్దరలోపల నేసభ నైన
సిద్ధాంతముం జేసి చెప్పఁగా నౌనె?
నాతండ్రితో సమానంబుగా నేల
మాతండ్రి నుడువవు మాఱంజునిగూర్చి?
ద్రవ్యాశవచ్చిన దైవజ్ఞవరుఁడ
వవ్యయపాండిత్య యకట కావీవు
అన్నయట్లయితే జయంతునిఁ గూర్చి
మిన్నంట నుడుదువు మినుకులు పెక్కు.
అట్లుచేయమిఁ జేసి యయ్య నీమాట
యొట్లైన నిలసత్యమే గాఁగవలయు

అట్లు కావలయునే నక్కట యిట్టు
లెట్లు వచ్చె నకాలమృత్యువు నేఁడు ?
అట్లుకావలయునే నౌర యీమృత్యు
విట్లువచ్చుట కల్లయేగాఁగవలయుఁ
గాకున్న హరికృపా కారణంబునను
నాకవైద్యులువచ్చి నామీఁదికరుణ
నాతండ్రి మొండెమ్ము నాతండ్రి తలయు
వే తగ నదికించి ప్రేమచేఁ బ్రాణ
ముంబోసి యెప్పటిపోల్కి నాకంట
నుం బెట్టుదురు నామనోవ్యథపోవ
మొదటి దసంభవంబు దలంపఁగాను
మది రెండవది చూడ మఱి నిజం బౌను
దైవజ్ఞ కాదేని దలఁపఁగానట్లు
నీవాక్యశుద్ధియు నిష్ఫలంబౌను
మఱి నాపతివ్రతామాహాత్మ్యమెల్లఁ
బాఱిపోవు నిక్కంబు పుడమిలోపలను
హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర
హాపుత్ర హాపుత్ర హాపుత్ర పుత్ర

[దుఃఖముతో నేల వ్రొగ్గుచున్నది]

సుశీల.—[సావిత్రీదేవి మరల లేవనెత్తి తనకుఁ జేరఁగిలఁగూర్చుండఁ బెట్టికొని] ఏమితల్లీ యీవెఱ్ఱి! అంతటికిని భగవంతుఁడే కర్త సుమా!

విదూష.—[చేతిలోనివీవన క్రిందఁబెట్టి]

చ. వినుఁడు భవాభవంబులకుఁ బృథ్విపయిం బురుషుండు కర్తగాఁ
డనయముఁ ద్రాడుగట్టి పరుఁ డార్పఁగ నాడెడుకఱ్ఱబొమ్మ చా
డ్పునఁ గడుదైవవశ్యుఁడుగ భూమివిధాత్రుఁ డొనర్ప నాడుచుం
డునది కతంబుగాఁగ నెవఁడుర్వ నెపపెట్టఁగఁగూడ దొడ్లనున్. 6

[అని వీవనతో మరల ముంజానికి వీచుచున్నాఁడు.]

సావిత్రీ.—[భగవంతునిగూర్చి దుఃఖముతో]

దేవ దేవా దేవ దేవేశ దేవ
యీవు నన్నీరీతి నేఁపంగ మేలె?
ఫల మేల యిచ్చితి వాత్సల్య మపుడు
వెలయ? నాఫల మేల పిదపఁ గైకొంటి? 4
యిచ్చితిపో దాని నిన్నాళ్లదాఁక
మచ్చిక ననుభవింపఁగఁ జేసితేల?
చేసితిపో చలచిత్తత నన్ను
గాసిపెట్టుచు దానిఁ గైకొంటి వేల? 8
యిచ్చి పుచ్చికొనుట యిది నీకుఁ దగునె?
యిచ్చి పుచ్చికొనెదు నీలగ్రద్దవు దె? 10

సుశీల.—దేవుఁ డేమిచేసినాఁడమ్మా వెఱ్ఱిదాన? దేవునికేమయినా పగా మనమీఁద? మనకర్మ మాలాగున నున్నది. పూర్వకర్మఫల మెంతటివారికయిన ననుభవింపక తప్పదు. ఋణానుబంధము. ఏనాఁడో ఋణమున్నదానవు. ఆఋణము తీర్పించికొన్నాఁడు వెడలిపోయినాఁడు. ఆలాగున మృత్యువు తోసికొనివచ్చినది.

సావిత్రీ.—[మరల దుఃఖ మభినయించి మృత్యుదేవతనుగూర్చి]

మృత్యువా యేలమ్మ యీరీతి నిప్పు
డత్యుదగ్రతవచ్చి యకట మాయింటఁ
జొచ్చి నాముద్దులసుతుఁ బసిబాలుఁ
బొచ్చెంబు లెఱుఁగనిపుణ్యాలవాలు 4
నెట్టిదో పాపంబు పృథ్విలోఁ బుణ్య
మెట్టిదో యెఱుఁగక యొసఁగెడు బాలు
నొకచెంపఁ బాలును నొకచెంప నీరుఁ
బ్రకటంబుగాఁగను వర్తించు బాలు 8
నాఁడుది యిది మఱి యవనిలో మగఁడు
వీఁడంచు నెఱుఁగక వెలసెడు బాలుఁ
దనచదువేమొకొ దానేమొగాని
మనమున నెఱుఁగక మనియెడుబాలు 12

వెలయంగఁ గలిగిన వేయియేండ్లకును
నిలలోన నాలుగేం డ్లైడలినబాలు
మ్రింగితి వేలమ్మ మృత్యువా నీకు
మ్రింగంగ దగువారు పృథ్విలో లేరె ?
మెత్తనివారిని మేదినిఁ జూడ
నొత్తబుద్ధి యటంచు నొప్పుగా వినమె ?
పరభామలంగూడి పాపంబుచేసి
తిరుగ సిగ్గునులేని ధీయుతుల్లగ్గ
దొంగతనముసేసి దొరవోలె మిగులఁ
బొంగుచుఁ దిరుగాడు పూరుషుల్ గల్గఁ
గల్లలు నిక్కముల్ గానాడుచుండి
పిల్లిమీఁద నెలుకఁ బిల్లిని నెలుక
మీఁద నెక్కించుచు మెలపుతోడుతను
మేదినిమీఁదను మెలఁగువా రుండ
భువి నేలు తగఁదాఁటి పొందేది తెప్ప
దవులంగ బెట్టెడు ధన్యాత్ము లుండఁ
జెట్టుమీఁదకిని నెచ్చెలిని నెక్కించి
యట్టె నిచ్చెన తీయునట్టివారుండ
నధికార కారణం బై నట్టిగర్వ
మధిగతంబుగ నంధులై నవారుండ
నధికార కారణం బై నట్టిగర్వ
మధిగతంబుగఁ దుచ్ఛులై నవారుండ
నధికార కారణం బై నట్టిగర్వ
మధిగతంబుగఁ గ్రూరులై నవారుండఁ
గటకటా లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగ సాక్ష్యమాడువారుండఁ
గటకటా లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగ వాదమాడువారుండఁ

గటకటా లంచముల్ గైకొని సభల
నటమటమ్ముగ దీర్పు నధికారులుండ
నేలమ్మ వారల నిలలోన విడిచి
తేలమ్మ నాఖాలు నిట్టె మ్రింగితివి?
కర మొద్దుపాడవునుగలవారి విడిచి
హారిహారీ పసికూన హరియించితేల?
పసికూన హరియింపఁ బాపమే కాక
పసిగ నీయాకలి సచ్చెనే చెపుమ.

భయపడితే వారిభయదరూపంబు
భయదమా హృదయంబు పరికించి నీవు?
దుష్టునకుండుము దూరంబటన్న
సుష్ఠువాక్కదనుంచి చూడవో వారి?
నీకంటెఁ గ్రూరులు నిజము లేరండ్రు
లోకంబులోన నాలోచించి చూడ
నేనిప్పు చెప్పిన యీయెల్లఖలులు
గానంగ నీకంటెఁ గడుఁ గ్రూరులు సుమి?
గడుసుఁదనంబొకో కడుపెత్తితనమొ
వడి నిట్టులో మృత్యువా చేసితేల?
కర మిట్లు సర్వాధికారంబు నీకు
హరియిచ్చినాఁడొకో యకట నీగుణము

నరయక? యోదేవి యరయక గుణము
ధర నధికారంబు తగ దేరికీయ.
అరయక గుణమొక్కటైనను బదవి
నరుల కొసంగుట నాగరకత్వ

మెక్కుడై నకొలంది నిస్సిరో తద్ద
యొక్కడౌచున్న దదేమొకో వింత
గ్రంథంబు లొకకొన్ని కంఠపాఠంబు
లంధులగలిఁజేసి యక్కటా యందు

ముక్కున నిడికొని మూఁడు ముక్కలను
నిక్కి నిక్కి పడుచు నిట్ట తాడిఁ బలె
నకట పరీక్షలయందును దేలి
వికట మానట్లుగా వేషముల్ వేసి.

తన రెడువారు విద్యావంతు లనుచు
మనమున నెంచుచు మన్నన చేసి
పృథ్విలో నధికార మిాజొచ్చినారు
పృథ్వీశు లొకకొంద ఱీకాలమందు

అట్టిదానవె మృత్యువా నీవు సుమ్మి
యిట్టిదేవిద్య నామృత్యువా వినుమ
యిది మంచి యిది చెడ్డ యిది సూనృతంబు
నిది కల్ల యిది దైవ మిది పౌరుషంబ

టంచెఱుంగుచు వైరు లార్వుర గెల్చి
మంచిగంధపుఁబాత్ర మధ్యమందొక్క
పదమును రెండవపదమగ్ని నుంచి
పదిలంబుగాఁగ నిప్పతిపాతమున

నెవ్వారు వ్యవహార మిలఁజేయువార
లవ్వారు సువ్వె విద్యావంతు లవని
అంతెకా కోయమ్మ యంతకురాల
యింతలుసేసెదు నీయట్టివార

లవనివిద్యావంతురాండ్రు రే? యీాప
దవి నీకు నలబ్రహ్మ తానేలయిచ్చె?
ఇచ్చెఁబో తానప్పు డిందాఁక నిన్ను
బెచ్చుపెరుగనిచ్చెఁ ఛేర్మితో నేల?

నిన్ను దప్పింపంగ నేరఁడే తాను?
నిన్నేల తప్పించు నీవేగి తనదు
పయిఁబడుదు వటంచుఁ భయపడుఁ జుమ్మి
భయముకా కదివానిభక్తి యానటవె

విద్దియగలవారి వేగఁ దప్పింప
దద్దయు నేర్చిన ధన్యుఁడు వాఁడు
ముది మదిదప్పిన మూఁడుగుణంబు
లదిర యెక్కువటన్న యామాట వినమె ? 100

తన పెద్దపదవియుఁ దన పెద్దపేరు
గని మనంబునఁ బెద్దగర్వించినాఁడు
అత్తయు నొకకోడలను నట్టిమాట
చిత్తగింపకయుండ సిగ్గేల లేదొ ? 104

తాను సేవకుఁడను దథ్యంపుమాట
మానసమ్మునను నుంపండు గర్వించి. 106

[అని కన్నులుమూసికొని దుఃఖించుచున్నది].

విదూష.—ఓహో దుఃఖములోనున్నను నెంతయు క్తియు క్తములుగ నున్న యీతల్లివాక్కులు! మేమమ్మా వావదూకులము సభలలో నుపన్యాసముల నిచ్చెద మంచు బిరుదులుగట్టికొని తగుదు మంచువచ్చి వేయుమాటపదియాఱులు దోఁచికొనిపోవు పండితులైన నిట్టి రసవంతములైన మాటలాడఁగలరే ?

ప్రథమచేటి.—ఈయమ్మ కవిత్వము చెప్పుచున్నదిగాని యిది దుఃఖము గాదు.

ద్వితీయచేటి.—సమస్తవైభవము లనుభవించునపుడుగాని కవిత్వము స్ఫురింపదని కొందఱుకవు లందురుగాని యిది పిచ్చిమాట కష్టములో నున్నయప్పుడే బుద్ధి విశదముగా స్ఫురించును జుమ్మీ యమ్మా.

తృతీయచేటి.—ఈయమ్మపలుకులు కవిత్వముమాత్రమే కాదు వేద వాక్కులు. ధర్మనిరూపణము చేయుచున్నవి.

సుశీల.—ఆబుద్ధికుశలత యట్టిదమ్మా ! ఈతల్లి రాఁదగ్గ కష్టము కా దమ్మా ! ఆజీవున కాలాగునఁ గాలము తోసికొనివచ్చినది. ఆవత్సుఁ డెప్పుడువచ్చినాఁడమ్మా యిక్కడకు ?

సావిత్రి.—[తెలివి తెచ్చికొని]

భృత్యవత్సాయేల మృత్యువుకంటె
నత్యుదగ్రత మ్రింగి తకట నాపుత్రు ?
మన సెట్లు కొలిపెను మాన్యుఁడౌ రాజ
తనయుని జంపంగ ధర్మాత్మ నీకు ?
నానాథుకంటె నోన్యాయవిదూర
యానె ముంజుం డెక్కు వక్కట నీకు ?
నిన్నగాకయ మొన్న నిక్కంబుచూడ
చెన్నార నితఁడు వచ్చినవాఁడు కాఁడె ?
నానాథుఁ డెన్నియే న్నంగులనీకు
దానుపకారముల్ తగఁజేసెఁగాదె ?
ఇలనార్యపుత్రుని యేల్బడిలోన
నెలమియు భయభక్తి లేసక మెసంగ
నెత్తిన నమ్రత నెదుట నిల్చుండి
చిత్తము చిత్తము చిత్త మటంచు
సేవించితివి కాదె చెన్నార ? నల్ల
సేవ యెట్టులు మఱచితివి ఛీ నేఁడు ?
లెంకలగుణమేను లెస్స గన్గొంటిఁ
బొంకంబుగాఁ గొల్చి పుడమిలో నొక్క
యధిపు నాతఁడు చన్నయామీఁదవచ్చు
నధిపునిమ్రోలను నతనిదూషించి
క్రీడాచరింతు రుక్కువము మీఱంగఁ
గీడెయా నవ్వారికిని దుట్టతుదకు
అంతేకా కక్కట యలఁతులబోవు
నంతటివారె మహాత్ములు జగతి ?
ఏనుంగువోవుచో నిలఁగుక్క మొఱుఁగ
నేనుంగుమహిమకు నేమికొఱంత ?

[ఏడ్చుచు నేల కొఱఁగుచున్నది.]

సుశీల.—[సావిత్రీదేవిని లేవనెత్తి కన్నీరు తనపయ్యెద చెఱఁగున నొత్తి తనకుఁ జేరగిలఁబెట్టికొని పట్టికొని] ఊఱడుమక్కా

యూఱడుము. అంతకంతకు వెఱ్ఱి యెక్కువగుచున్నది. విధి వశము దాఁట నెవరికి శక్యము? ఈచెప్పినదెల్ల నీకుఁగాదె? కొడుకును నీవే కంటివే! కనకకనకకన్న కొడుకును సుగుణాభి రాముని రామునిఁ బట్టముగట్ట నున్నతఱిఁ బట్టములేదు సరియ కదా మీఁదిమిక్కిలి పదునాలుగుసంవత్సరము లాతనిఁ గౌసల్యా నాఁడు గోల్పోదే? గుణములకుప్ప యగుసారంగధరుని కాలు సేతులు నిష్కారణముగఁ దండ్రి నఱకింప రత్నాంగి యూఱ డిల్లదె? చచ్చినవానికన్నులు చేరెడేసి నీవు విలపింప నేమి ప్రయోజనము? ఏడ్చినఁ జచ్చినవారు వత్తురె? రాఁగలరేని భోజకుమారునిఁగూర్చి నేనేడ్చుటయగాక కన్నీటితో శిప్రా నది కూలంకషముగ నిండునట్లు కూలి యిచ్చి యితరులచేత నేడ్పించెదను. మీఁదిమిక్కిలి మన మేడ్చినకొలఁది నట్టివాఁడు మనపామరత్వమునకు నవ్వుచుఁ బరమపదమున నుండును గాని మనము తల్లులమని విశ్వాసముగలఁడే? తెలిసినదాన వింత వెఱ్ఱిపడకుము. భోజుఁడు నీకుఁ బుట్టఁడయ్యెనని కొనుము. జయంతునిఁజూపి] వీఁడె నీకుఁ బుట్టినకొడుకు వీనిని సంరక్షించి కొనుము.

[జయంతుని సావిత్రీదేవియొడిలోఁ గూర్చుండఁబెట్టుచున్నది.]

విదూష.—[సావిత్రీదేవితో] తల్లీ యీయిల్లాలు మేలిమాట చెప్పినది. తనకుమారుని నీకు సమర్పించుటలో నియ్యమయౌదార్యము మిక్కిలి శ్లాఘనీయము. [సుశీలాదేవితో] తల్లీ యీయమ్మ నింక లోపలికిఁ గొనిపోయి స్నానము చేయింపుఁడు. ప్రొద్దువోయి నది. నేనును గొంచెముసేపు నిల్చి రాజుగారిని మూర్ఛదేర్చి తీసికొనివచ్చెదను. రాజుగారివిషయమై మీరు బెంగపెట్టికొన వలదు.

సుశీల.—[సావిత్రీదేవితో] మనమింక లోపలికిఁ బోవుదము లెమ్ము తల్లీ అని యాయమ్మను లేవనెత్తి చేయిపట్టికొని తీసికొనిపోవు చున్నది.

[చేటీజనంబును జయంతుఁడునుగూడ నిష్క్రమించిరి.]

విదూష.—[ముంజరాజును జేతితోఁ గొట్టి లేపుచున్నాఁడు.]

ముంజ.—[చయ్యన లేచి కూర్చుండి] బ్రదికినాఁడను రా బాబూ [విదూషకునితో] వాధూలా! భోజుఁడు తాను వ్రాసి వత్సునిచేత నాకుఁ బంపిన లేఖ నాకుఁ బ్రతిపద్యకర్ణకఠోరమయ్యెఁగాని సావిత్రీదేవివిలాపముతోఁ బలికినమాటలు ప్రత్యక్షరహృదయ శూలము లగుచున్నవి దీనికి నాకు మందుగానము.

విదూష.—సావిత్రీదేవిమాటలు నీకు వినపడినవా మిత్రుఁడా?

ముంజ.—నీమంత్రబలముచే వాధూలా!

విదూష.—మిత్రుఁడా మించినదానికి వగవఁబనిలేదు. వగచినఁ గార్య మేమి? కావున వగపు దక్కుము. ఏవీ భోజకుమారునిపద్య ములు చూడనైతిని.

ముంజ.—కాలెదుకో అవి యెగసనద్రోసెదవె? ఆపద్యములు నీవు చది వితే నాగుండె నిల్చునే?

విదూష.—రాజవంశమునందుఁబుట్టి గుండె నిలువదని యీరీతిని బేల మాటలు పలికితే నలుగురును నవ్వరే? బ్రాహ్మణుండయ్యును బరశురాముఁడు ముయ్యేఁడుమారులు పరశుస్ఫారకుఠారధార సమస్తక్షత్రజాతంబులఁ ద్రుంపఁడె? ప్రేలెడుగలబాలుని ముక్కు పచ్చలాఅనివాని జంపించి నీవు గుండె కుదుటఁబడక యింత కుందుచున్నవాఁడవు. ఐందేండ్లబాలుఁ డేపాటి రసవంతముగాఁ బద్యములుచేయఁగలఁ డేదీ వానిలేఖ చూతము.

ముంజ.—[తనచేతిలోని మఱ్ఱియాకులు నాలుగు విదూషకుని కిచ్చి] ఇదె చూడుము. భోజుడు కత్తితో దనపిక్కచీల్చికొని నెత్తురు తీసి యానెత్తుటితోఁ బూచికపుల్లవెట్టి యీయాకులమీఁద నాకు లేఖ వ్రాసినాఁడు.

విదూష.—[మఱ్ఱియాకొకటిచూచి చదువుచున్నాఁడు.]

సీ. తనకొడుకులకంటెఁ దమ్మునికొడుకులు
బలశౌర్యదర్పముల్ గల రటంచు

నీర్ష్యచేతను లక్కయింటను విడియించి
రవులఁబెట్టెను ధృతరాష్ట్రవిభుఁడు
ఆడి తప్ప నటంచు నడవిలో నుండంగ
దనకొడుకును బంపె దశరథుండు
రమణి కొండెముచెప్ప రాజనరేంద్రుండు
కొడుకు కాల్సేతులు గోసె నడవి

తే. వారి కారీతిఁ జేయఁగాఁ గారణంబు
లయ్యె నయ్యాయి భూతకార్యంబు లవని
నయ్య నను జంప నేఁడు నీకయ్యె నేమి
కారణంబు భవిష్యత్తుకారణంబొ ?

[ముంజరాజువంక తిరిగి] మిత్రుఁడా యిదియేమి పాపకర్మము చతుర్విధహృద్యాన్నంబులు గుడిచి శృంగారరసమొలుకుపద్యములు పాడుచు హాస్యరసమునుఁ బుట్టించుపలుకులు పలుకు నాకు నీశోకరసపూరమైన పద్యములు చదువవలయుట సంభవించెను. ఇట్టిపనికి నన్ను నియోగింప నగునే వలయునేని నీమంత్రి నొకనిబిలిచి చదివించికొమ్ము. [మట్టాకులు క్రిందఁబడవ్రేయుచున్నాఁడు.]

ముంజ.—కాదుకాదు. వాధూలా యింక లెక్క నాలుగుపద్యము లున్నవి. ఆనాలుగును జదువుము [మట్టాకులు చేతితోఁదీసి విదూషకునిచేతికి మరల నిచ్చుచున్నాఁడు.]

విదూష.—[రెండవమట్టాకు చూచి చదువుచున్నాడు]

సీ. తనయందు ధర్మతత్వం బూర్జితముగాఁగఁ
బృథ్వియెల్ల యయాతి యేలినాఁడు
సాపరాధారినే శరణన్న రక్షించి
యంబరీషుం డేలె నవనియెల్ల
లక్షభార్యల వేయిలక్షలపుత్రుల
లాలించి శశిబిందుఁ డేలె జగము
సత్రయాగముచేసి చాలఁ బుణ్యాత్ముఁడై
రంతిదేవుఁడు కీర్తి రాజ్య మేలె

తే. వారు నల్వురు దివికేగినారు వారి
వసుధవోదయ్యె నింతేని వారితోడ
నీవసుధయెల్ల నీతోడ నేగుదెంచు
నయ్యె నీవు దివంబున కరుగుతఱిని. 11

[మూడవమట్టాకుచూచి]

సీ. సురలు సాయముగాఁగ సురమాని నడప య
జ్ఞములుచేసెఁ బసిండిసాలలందుఁ
బిల్లచావులు మాన్పి తల్లివోలెను బ్రజ
రక్షించి వేలేండ్లు రాజ్యమేలెఁ
గాంచనాలంకృతకరితురగంబుల
గోకన్యలను విప్రకోటి కిచ్చెఁ
బ్రజల నొప్పింపక పరమపుణ్యాత్ముఁడై
యేడుదీవులు తాన యేలె మహిమ

తే. నామరుత్తుండు రఘురాముఁ డల్ల యంగుఁ
డాశిబియు నల్వురునుబోయి రవని విడిచి
యీభువనమెల్ల నీతోడ నేగుదెంచు
నయ్యె నీవు దివంబున కరుగుతఱిని. 12

[నాలవమట్టాకుచూచి]

సీ. చేచాఁచి సురరాజు యాచింప గుఱ్ఱంబు
నేమహారాజు వేయేలమి నిచ్చెఁ
దనపెద్దలు తరింప ధరణిలో మిన్నేఱు
భాగీరథి యనంగఁ బఱపె నెవఁడు
సన్మార్గవర్తియై జగ మెవ్వఁ డేలుచోఁ
బర్జన్యుఁ డిలఁ బైఁడి వానఁగురిసెఁ
బూర్వాద్రి యస్తాద్రి పొలిమేర లౌ మహా
క్షేత్ర మొక్కఁడ యేలెఁ జెలఁగి యెవ్వఁ

తే. డల దిలీపభగీరథు లకట యలసు
హోత్రమాంధాత లేగి రీయుర్వివిడిచి

యీభువనమెల్ల నీతోడ నేగుదెంచు
నయ్య నీవు దివంబున కరుగుతఱిని. 13

[అయిదవమఱ్ఱాకుచూచి]

సీ. అగ్నిదేవునిని బ్రత్యక్షంబుగావించి
గయఁగట్టి యేలె జగమ్మె వండు
శరభసింహవ్యాఘ్రచయముల నేఁడిక
లల్లిక్కి పసినాఁడ యాడె నెవఁడు
విసమానమైన తన్ను సమానముగఁ ద్రొల్లి
యెవఁడు సేయఁగ భూమి పృథివియయ్యె
ఱేఁడులనెల్ల ముయ్యేడుమాఱులు చంపి
భువియెల్ల నెవఁ డిచ్చె భూసురులకు
తే. నాగయుఁడు భరతుఁడుఁ బృథుఁడల్ల పరశు
రాముఁడునుబోయి రకట యీభూమివిడిచి
యీభువనమెల్ల నీతోడ నేగుదెంచు
నయ్య నీవు దివంబున కరుగుతఱిని. 14

[అని చదివి మఱ్ఱియాకులు నేలఁబాఱవైచి కన్నులుమూసికొని దుఃఖ మభినయించుచు నేలకు మ్రొగ్గుచున్నాఁడు.]

ముంజ.—[సంభ్రమముతో] వాధూల! వాధూల! వాధూల! [అని ముమ్మాఱు పిలిచి] ఓహో యిదియేమి! బ్రహ్మహత్య! వీనికి మాటపోయినది! నన్నుగూర్చి వీని కింత వంతపుట్టెను! [వాని చెయిపట్టికొని] వాధూల! [అని లేవనెత్తుచున్నాఁడు.]

విదూష.—[కన్నులుతెరచి] ఓరిబాబో యింకేమున్న దింకేమున్నది. [అని యులికిపడు టభినయించి కేకవేయుచుఁ జటాలున లేచి కూర్చుంచున్నాఁడు.]

ముంజ.—ఏమి వాధూల! ఇట్లు భయపడుచున్నావు? భోజుఁడు నన్నుదిట్టిన నీవు భయపడవలయు నేల?

విదూష.—నీకేమి! మహారాజవు. ఇక్కడున్నను మహారాజవే. అక్కడున్నను మహారాజవే. భోజుఁడు నిన్నెక్కడతిట్టినాఁడు?

నిన్ను దీవించినాఁడు. నీవు మంచివాడవే. తిట్టులు శాపములు మాకు. నడుమను మేము చెడ్డవాండ్ర మైనవారము.

ముంజ.—ఏమి వాధూల! పద్యార్థముచూచికొన్న నాచిత్తములుకు చున్నది. నీభావము నాకుఁ దెలియకున్నది. ఇది పరిహాసములకు సమయము కాదు. దుఃఖసమయము.

విదూష.—మిత్రమా:—లోకములో నెవరికిఁ గష్టములువచ్చినను నాకు సుఖముగానే యుండును. నేను హాస్యము లే పలుకుదును గాని యీపద్యములు నన్ను వ్యధ పెట్టుచున్నవి.

ముంజ.—ఎట్లు?

విదూష.—యయాతి మొదలగుపోడశమహారాజులు—అయితే మహారాజులు పదియాఱుగురుమాత్రమె యుండిరే? ఈకలియుగము పుట్టి నాలుగు వేలేండ్లు కడచెను. అంతకుముందు మూఁడు యుగములు కడచెను. ఇన్నియుగములకు నూటతొంబదిరైదు కోటు లేబదియెనిమిదిలక్ష లెనుబదినాలుగువేలు మున్నూ తేండ్లకుఁగల మహారాజులు పదియాఱుగురే యుండిరే?

ముంజ.—మఱి యింకెంద ఱనికొంటివి.

విదూష.—ఒక యద్బుదముందురేమో యనికొంటిని. ఎట్లంటేని యిప్పుడు నాకు ముప్పదిమూఁడేండ్లవయస్సున్నది. నాకు జ్ఞానము వచ్చినదిమొదలు నేను జూచుచుంటిని నేఁటిదాఁకఁ గలమహారాజులు తొమ్మన్నూటతొంబదితొమ్మండ్రు గలరు. ఈమూన్నాళ్లకే తొమ్మన్నూటతొంబదితొమ్మండ్రయిన నాలుగుయుగముల కెంద ఱుండవలయును. నీవ యాలోచింపుము. [ఆకాశము వంకఁ జూచి] ఆహా! సంగతి తెలిసినది తెలిసినది. పూర్వము లోకమంతయు జయించి యరిషడ్వర్గము జయించి తపోగరిష్ఠులై దేవతలనుమించి భగవంతునివరములు వడసి లక్షలకొలఁదిజనులకు దానములిచ్చి ప్రజల లేమిఁ బాపి ధర్మము నాలుగుపాదముల నడపించురాజులుమాత్రము మహారాజబిరుదాంకములు వడసిరి.

ముంజ.—మఱి మున్నే మనికొంటివి?

విదూష.—ఈనేఁటికాలమందుఁబోలెనే యని భ్రమసితిని. ఇప్పుడు మహమ్మదీయులు మనరాజ్యమునకువచ్చుట మొదలు బిరుదములు చౌకయయ్యెను. ఇప్పు డవి డబ్బుతో దొరకుచున్నవి.

ముంజ.—చాలు నిఁక నీబాధయేమో చెప్పవయ్యా వాధూల! అక్కఱమాలిననీతులన్నియు నిప్పుడు బోధించుచున్నవాఁడ విది సమయము కాదుసుమా! ఇంక నీయుపన్యాసములు చాలించి వక్తవ్యాంశములోనికి దిగుము.

విదూష.—దిగెదను దిగెదను. నీవు నొకరాజవగుటచే నీకిట్టిమాటలు రుచింపవు. మన యీప్రసంగ మేమహాకవియైన విని యొకనాటకము చేసి యాడించెనేని చూపఱ కెంత బోధకరముగా నుండునో మిత్రుఁడా?

ముంజ.—నీవు మాటలలో మిక్కిలి నేర్పరివి నేనెఱుఁగుదునయ్యా వాధూలా!

విదూష.—ఒక్కమాటలలో నే యనికొంటివే భోజనములోఁగూడ మిక్కిలి నేర్పరిని. వీసెబూరెలు తినుమంటే నూటపదియాఱింటికిఁ దక్కువతిందునే? అయిన నింక నీహాస్యములువిడిచి మాటలాడెదను వినుము. [ఆకాశమువంకఁజూచి మరల ముంజునిఁ జూచి] మిత్రుఁడా యిందాఁక నేమి చెప్పఁబోయితిని? నాకు మఱపెక్కువగదా!

ముంజ.—"యయాతి మొదలగుషోడశమహారాజులు" అని యారంభించితివి.

విదూష.—ఆ! తెలిసినది తెలిసినది. యయాతి మొదలగుషోడశమహారాజులు తపోయజ్ఞాదులు వేలకొలఁదియేండ్లసంఖ్యముగా సలిపి దానధర్మపరులై ప్రజలను రంజింపజేసి దేవతలకంటె నధికులై నెగడి తుదకు స్వర్గస్థులగుతఱి నీభూమి వాడి సూదిమొన మోపినయంతమాత్రయును గైకొనక విడిచిపోయిరనియు నట్లుగాక మూన్నాళ్లపట్టపగ లీభరతఖండములో నొకమూల

రాజ్యముచేసిన నీతో నిబ్భువనమెల్ల స్వర్గమునకు వచ్చునని యును భోజుఁడు తనపద్యములలోఁ జెప్పినాఁడు బాలవాక్య మును గవివాక్యమును రిత్తవోవదు భోజకుమారుఁడు బాలుఁ డును గవియును గావున నిది సిద్ధించును. నిశ్చయము. నేనాలు బిడ్డలతోఁ గాపురమున్నవాఁడను. ఈభూమియెల్ల నీతో స్వర్గ మునకు వచ్చినయెడ నేనెక్కడ కాపురముందునా యని విచా రించుచున్నాను నే నొంటినుంటి నేని సముద్రములో నీదికొని పోయి యావటపత్రశాయివోలె నమ్మఱ్ఱిచెట్టెక్కియుందును ఆలుబిడ్డల నేమిచేయుదును. వారిని విడువఁదగునా ? ఆలిని బెండ్లియాడునప్పుడు మజ్జనభోజనాదులును సమస్తకర్మములును నీతోనకాని చేయనని యాలికి మగఁ డగ్నిసాక్షిగాఁ బ్రమాణ ములు సేయునకాదే ? అట్టి మహాప్రమాణములు పొల్లుసేయ నగునే ? ఆడితప్పుటకంటె దోషమున్నదె ? మఱియు బిడ్డ లనఁగా నెవరు తానే సుమా ! మగఁడు తానే భార్యగర్భం బున సంతానరూపంబుగఁ బుట్టును. కావున నాలుబిడ్డల విడ నాడఁ జనదంటిని. మీఁదటికి నా కాలోచన నీవే చెప్పుము చెలికాఁడా ?

ముంజ.—నీ కాలోచన చెప్పుటకు నీకంటె బుద్ధిమంతుఁ డెవఁడు ? ఈయుపన్యాసము చూడఁగ నాకుఁ దలయెత్త సిగ్గగుచున్నది వాధూల.

విదూష.—ఆహా ! ఇప్పుడు తెలిసినది. నాఁటిహనుమంతుఁ డెఱుంగ నట్లు నాబలము నే నెఱుంగను. నాబుద్ధిని నీవు పొగడిన మీఁదట నిప్పుడు భోజకుమారునిపద్యార్థము చక్కఁగఁ దెలిసి నది. నీతో నిబ్భువియెల్ల దివికివచ్చునని యాతఁడు చెప్పిన వాక్యములో భువి యనఁగా వట్టిమన్నని మూఢుఁడనై మొదట నర్థముచేసికొంటిని. పాండిత్యప్రకర్షములేమిచే నట్టియర్థము తోఁచెను. భువి యనఁగా నీకనఁబడుభూగోళమును నిందుగల చెట్టులుఁ బుట్టలు గుట్టలు గట్టులు నిండ్లు వాకిండ్లు మేడలు మిద్దెలు స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు గుఱ్ఱములు గాడి

దలు నేనుఁగులుఁ బీనుగులు లొట్టిలు ముంతలు నావులు నెద్దు కుక్కలు నక్కలుఁ బిల్లులు నల్లులు మొదలుగాఁగలసమస్తవస్తువులు నని యర్థము. అదిగావున మేమందఱము నీతోన గృహారామాదిసహితముగా వచ్చువారము. ఈరాజ్యమే నీవు స్వర్గమందుఁ జేయుదువు. నాకేమిటంగొఱఁత ? అయినను నింకొకటి గలదు. మిత్త్రుఁడా! నేను నిద్దురపోతును గువ్వకూడెక్కఁగానె యవ్వమంచ మెక్కనసామెతను సూర్యాస్తమయమయినతోడనె పొట్టనిండ మెక్కి నిద్రకుఁబడి మఱునాఁడరుణోదయమున లేచువాఁడను. ఆమధ్యకాలములో దొంగలు పడి యిల్లుదోఁచికొనిపోయినను నన్ను దోఁచికొనిపోయినను గన్ను దెఱచి చూడను. బుస్సుకొట్టి నిద్రపోవుచునే యుందును. ఇప్పుడు నీతో స్వర్గమునకువచ్చినవెనుక నానిద్రకు భంగము వచ్చునుగదా యని చింతించుచున్నాను. ఆలోకమందు తెప్పపాటు లేదుగదా ప్రత్తికాయలవలె గ్రుడ్లు తెఱచికొని కూర్చుండవలయును.

ముంజ.—పోనిమ్ము. రాత్త్రులు నాలుగుజాములుఁగూడ భక్ష్యములు భుజింపవచ్చును.

విదూష.—రాత్త్రులుగూడ బూరెలు భక్షింపవలయునని యాసగలదు గాని యవి యఱుగుట యెట్లు? ఇప్పుడు రాత్త్రులు నాలుగు జాములు నిద్రపోవునపుడే పగటియందుఁ దిన్నభక్ష్యములఱుగకున్నవి. నిద్ర లెస్సగఁబోయినఁగాని యన్న మఱుగదు.

ఉ. నిద్దుర మూఁడుయామములు నెమ్మది రాతిరి వేళఁబోయినం
దద్దయు భోజనం బఱుగుఁ దక్ష్యము కన్నులు తేటగాం చెదుఁగా
బెద్దశిరంబు చుల్కనగు వేడుకపుట్టును లాఘవంబునం
దద్దయు వేగ వెన్కటిదినంబున వౌపను లెల్లఁ జేయఁగన్. 15

అదిగావున నిద్దురవలయును.

ముంజ.—ఇదియా నీభయము ?

విదూష.—మఱియొకటి గలదు, మిత్త్రుఁడా !

ముంజ.—అది యేమిటిది ?

విదూష.—చెప్పెద విను మిత్రుఁడా! దైవానుగ్రహంబున నాకుఁ గల వేయేండ్లకు నిప్పటికి ముప్పది రెండువెడలి ముప్పదిమూడు సంవత్సరములు వచ్చినవి. ఇంతదాఁకఁ బరస్త్రీమొగ మెఱుఁగను. పరస్త్రీ యనఁగా నాయర్థము భార్యకంటెఁ బరస్త్రీ యని గాని కొందఱు మహానుభావులు చెప్పెడిరీతిని బరునిభార్య మాత్రమే యని కాదు. భోగముది సామాన్యయని మన గ్రంథములలోఁ జెప్పినప్పటికిని నామతమందు భోగముదికూడఁ బరస్త్రీ యనియును భోగముదానితో సంభోగించినను బరస్త్రీ సంభోగదోషము మనుష్యునకుఁ బట్టికొనుననియును నీకుఁ దెలిసెఁగదా! ఆలోకములో నావివరుసలు లేవుగదా! ఎక్కడఁ జూచినను వ్యభిచారమే కదా! అక్కడ నీయొద్దికివచ్చురంభాదు లెవ్వరైన నాయొద్దికివచ్చిరేని పాపభీతిచే నాయొడలు వడవడ వడఁకును. పాపభీతియేగాక యొకఁడు సంభోగించినతరుణితో సంభోగించుటకు నామనస్సోకిలించును. తననలుగురుతమ్ములును వంతులువేసికొని కామోపభోగంబు లనుభవించినతరుణి యగుద్రౌపదితో ధర్మరాజు నజాతశత్రుఁడు నని ప్రసిద్ధివడసినయుధిష్ఠిరుఁ డెట్లు సంభోగించినాఁడో తలఁచికొన్నంత మాత్రమున నాకసహ్యమగుచున్నది. మఱియు రంభాదుల కోర్కి దీర్పకుంటినేని వారు నన్ను శపింతురేమో యని భయముగూడఁ బుట్టును. వారు భూలోకస్త్రీలబోఁటివారు కారుగదా! ఇక్కడి యిల్లాండ్రెన్నఁడైన నట్లు చేయుదురేని యత్యంతప్రియుఁడువోలె నాలుగుమంచిమాటలు చెప్పి మాయ చేసి దాఁటికొనిపోవుదును. లేకున్నఁ బరమశత్రుత్వ మభినయించి మాటలాడక బెల్లముకొట్టినఱాయివోలె నుందును. పిమ్మట వారు నన్ను దిట్టినను వారు సామాన్యమనుష్యస్త్రీలగుటంజేసి వారితిట్టులు తగులవు. వారు నామీఁద నపనిందలు వేసినను నవి వారికే యెదురుతగులును. నేను వారివేఱెత్త కూఱకుందును. ఆలోకములోనివారితిట్టులైననో తగులక

మానవు. దేవుఁడని మ్రొక్కఁబోవ గుడివిరిగి మీఁదఁబడ్డట్లు తా నూర్వసియందు మాతృభావము దాల్చినదానికేఁగదా యూర్వసిలీట్లుచే నర్జునుని యట్టిమహాపరాక్రమశాలి యేఁడుఁ గాల మాఁడురూపు దాల్పవలసెను. నేనెంతటివాఁడను. మఱియు అంకుటాం డ్రాంతకయిన సాహసినులు. నాఁడు చిత్రాంగి చేసినట్లు నామీఁద నీతో కొండెములుసెప్పి నన్నేమి చేయింతురో యనుభయముకూడఁ గలదు. రాజనరేంద్రుఁడు సారంగధరుని కాలుసేతులు నఱకించినట్లు నీవు నా కాలుసేతులు నఱకించినను నాలోకములోఁ జావులేమింజేసి నేను జావను గాని యాలోకములో నుండఁదగనని నన్ను మరల నీలోకము లోనికిఁ ద్రోయుదేమో యని భయంపడుచున్నాను. భోజుని శాపముచే—శాపముచేఁ గాదు వరముచే—నప్పు డీభూలోక ముండదుగావున నాకునికిపట్టెక్కడ ? అధోలోకములయందుఁ బడవలయుట సంభవించును. ఒకవేళ నేవిశ్వామిత్రముని యైనఁ గరుణించి నన్నుఁ ద్రోవలో నాఁగనేని త్రిశంకుఁడు వోలె నాకాశమందుఁ దలక్రిందుగ వ్రేలుచుండవలయును. పుణ్యమునకుఁబోతేఁ బాప మెదురువచ్చెనన్న సామెతను వ్యభిచారమునకు వెనుకదీసినదానివలన నా ప్రియురాలినిగూడఁ గోలుపోవలయువాఁడ నగుదును. ఎట్లు దైవమా యని చింతించుచున్నవాఁడను. ఇప్పటివ్యవహారములుకూడ నిట్లే యున్నవి.

ముంజ.—ఏమివ్యవహారము లెట్లున్నవి ?

విదూష.—నీరాజ్యములోనియుద్యోగస్థులలో లంచములు పుచ్చికొనుమహానుభావులందఱును లంచపుధనముల చేతను సరియ కదా మఱియు నీవిచ్చుజీతవృద్ధిచేతనుగూడ విశేషధనికులై మేడలు మిద్దెలు గట్టికొని సిరిసంపదలతోఁ దులదూఁగుచున్నారు. లంచములు ముట్టక మనస్సులోసహితము లంచముల నేవగించుచుఁ బరులకు నీతు లుపదేశించుచు లోకగురువు లనఁదగి గ్రహచారవశంబున సేవలోఁ బ్రవేశించినవారికి జీతమ్ము

వృద్ధిలేదు సరేకదా మీఁదిమిక్కిలి [illegible]లలో విశ్వతుల్య నధికారభంగములును గలవారగుచున్.

ముంజ.—అది యెట్లే వాధూలా ?

విదూష.—నిస్సందేహముగా మిత్రుఁడా! నీవు రాజ్యభారమును సమస్తమును నీప్రతినిధియందుంచి కూర్చున్నవాడవు. నీవు రాష్ట్రమందుండినను బరదేశమందు నివసించుచున్నట్టులే యున్నది.

ముంజ.—ఔరా భోజకుమారుని వ్యంగ్యప్రధానములైన పద్యములకంటెను నావదినె బాణతీక్ష్ణములైన విలాపములకంటెను నీ వాధూలునివాడిమాట లీటెలువోలె నాహృదయమును బొడిచి దూసికొనిపోవుచున్నవి. నాకేటిబ్రదుకుదైవమా! (నేలకొఱగుచున్నాఁడు.)

విదూష.—ఔరా! ఎంత వెఱ్ఱివాఁడనయితిని? కొడుకుఁ జంపినంత ఘోరపాపకృత్యముచేసినవాని కీనామాట లొకలెక్కయే యని యెంచి యిట్లు భావగర్భితముగాఁ బలికితిని. ఇప్పు డేమి చేయుదును. [ముంజుని లేవనెత్తి తనకుఁ జేరగిలఁగూర్చుండఁ బెట్టికొని] మిత్రుఁడా! యాఁడుదివోలె నింత బేలవైతేల? మించినదానికి వగవనేల? అదిగాక నీయెడ దోస మేమిగలదు? రాజధర్మము నీవెఱుంగనిదే? సామదానభేదదండోపాయములచే శత్రునిరాస మొనర్పుట రాజులకు ధర్మముగాదే? వీరు పుత్రులు వీరు పౌత్రులు వీరు భ్రాతలు వీరు తాతలు నను నివి లోనుగాగలబాంధవములు విచారింతురే? కావున నింక నూఱడుము. లెమ్ము లెమ్ము స్నానసంధ్యాద్యనుష్ఠానములు తీర్చికొని భోజనముచేయుము.

ముంజ.—[కన్నులు దెరచిచూచి] కాదుగాని వాధూలా నామనస్సు మనస్సులో లేదు. ఆమాయజ్యోతిష్కుఁ డేలవచ్చె? వచ్చెఁబో సుమంతుఁడు వానిని నాయొద్దకేల తెచ్చె? తెచ్చెఁబో వానికి జాతకములు చూపుమని యేల చెప్పె? చెప్పెఁబో నేనేల చూపితిని? చూపితినిబో యాజ్యోతిష్కుఁడు భోజజయం

తులకు ఖేద మేలనేసె ? చేసెఁబో భోజున కుచ్ఛదశ యేల
నుడివె ? నుడివెఁబో నేను నమ్మితి నేల ? నమ్మితినిబో యూఱ
కుండ నైతినేల ?

ఆ. తన్ను గట్టఁద్రాళ్లు తాఁదెచ్చికొన్నట్టు
లూఱకుండ లేక యొప్పు లొలుకు
ఖాలుఁ జంపి నిందపాలైతి నాకింక
నేటిరాజ్య మకట యేటి బ్రదుకు ? 16

కావున నే నీదినమే ప్రాణత్యాగము చేసెదను. మంత్రివరుల వేగమ పిలిపించి ప్రాయోపవేశంబునకు వలయుసంభారములు తెప్పించి సన్నాహము సేయింపుము. అట్లు కాదేని, వానప్రస్థ మొండె సలిపెదను. ఇంక నీవు మఱుమాటలు వలుకకుము.

విదూష.—[మనస్సులో]ఁ ఊఁవహా ! ప్రాణత్యాగ మెల్ల వానప్రస్థము లోనికి దిగినదికదా ! ఇఁక భయములేదు. [ప్రకాశముగా] నీప్రాణత్యాగము యథాశక్తి సహగమనమన్న రీతి యగును మిత్రుఁడా !

ముంజ.—ఏమిటిది యథాశక్తి సహగమన మేమిటిది వాధూలా ?

విదూష.—పూర్వ మొకయిల్లాలు తనమగఁడు చచ్చినపుడు సహగమనము చేసెదనని నోరు నెత్తి బాఁదికొనుచు వలదని యెందఱు బ్రతిమాలినను వినక వారినందఱను వంకలకుఁ ద్రోయుచుఁ గాటియొద్దికిఁ బీనుఁగువెంటఁబోయి యేడుగరచుచుఁ బయ్యెద చెంగుతో నడుముబిగించికొని చితిచుట్టు మూఁడుమాఱులు ప్రదక్షిణము చేసి నిల్చుండి "యథాశక్తి సహగమనం కరిష్యే" యని తనపిక్కమీఁది వెండ్రుక యొకటిపీకి మండుచున్న చితి మీఁదనున్న తనమగనిపీనుఁగుమీఁద బడవైచినది.

ముంజ.—కాదు వాధూల నాకేమోగాని రాజ్య మేల వలయునను బుద్ధి పోయినదయ్యా.

విదూష.—మఱియు వినుమయ్యిల్లాలిని దూషింపకుసుమీ ! ఆయమ్మ నామనస్సువచ్చినది. మగఁడు దైవవశముచేతఁ జచ్చెనేని

పెండ్లము మరలఁ బెండ్లియాడగూడదనియును మఱియు నాత్మ హత్యచేసికొనవలయుననియు నట్లుగాకున్న బుట్టిగొరిగించికొని యొకపూట భోజనముమానవలయు ననుధర్మ మేమిన్యాయ ముగ నున్నది? తనదిగాకున్నఁ గాశిదాఁక దేఁకుమన్నాఁడట. ఆహా మెతగ ధర్మశాస్త్రకారులు మగవారగుటచేతఁ దమకు బాధింపని యవకతొవకపనులు ధర్మములని చెప్పి వెన్నకంటె మృదువైనహృదయములును నున్నని యనంటిమొవ్వుకంటె మృదువువైన శరీరములును గలయాఁడువారివిషయములో విధించినారు స్త్రీలు మెత్తనివారగుటంజేసియు సాధారణ ముగా మగవాండ్రచేత విద్యనేర్పఁబడక యజ్ఞానాంధకార ములో నునుపఁబడినవారగుటంజేసియు మగవాండ్రమోస ములు కనిపెట్టలేక వాండ్రే దైవతములని యెంచి వాండ్ర నోటిమీఁద నడచుచున్నారు. వారే పూర్ణముగాఁ జదివికొని మనోధైర్యముగలవారయిరేని వారు నిజముగా మగవాండ్ర నోటిమీఁదనే నడచువారలగుదురు. మఱియు నింకొక్కటి చెప్పెదను వినుమిత్రమా. నన్నే శాస్త్రనిర్మాతగా నియమించితి వేని భర్తచచ్చినస్త్రీ కిప్పటిశాస్త్రము విధించిన కర్మములు భార్యచచ్చినపురుషునకు నేను విధింపఁగలవాఁడనుజుమీ!

ముంజ.—బాగుగాఁ జెప్పితివోయి వాధూల!

విదూష.—మఱియు నయ్యిలాలి దూషింపకుమీ. ఆయమ్మవలన నీఁగ కాలంతైన దోషములేదు. గుండెధైర్యములేనివారు లోకు లకు వెఱచి కొన్నికార్యములం దిష్టమైనను నిష్టములేనియట్లు నటింతురు. ఇష్టములేనివారయినను నిష్టమున్నట్లు నటింతురు. గర్భాధానమునాఁ డెప్పుడు ప్రొద్దుగ్రుంకునా మగని నెప్పుడు కలసికొందునా యని శోభనపుఁ బెండ్లికూఁతునకు మనస్సువ్వి ళ్లూరుచున్నను శయ్యాగృహములోనికిఁ బోవునప్పుడు మొగము నిర్వికారముచేసి చెలికత్తియల చాటుచాటుననేయుండి గునిసి గునిసి వెనుకడుగులిడుచుఁ దలుపుచాటుననే నిల్చుండి చెలి కత్తెలచేత బ్రతిమాలించికొని లోపలికిఁబోయెనో బోదో

యనునట్టుల నటించుచుఁ బ్రవేశించును. ఆరీతినే మగఁడు చచ్చిన వృద్ధస్త్రీ యయినను సహగమనము మనస్సునం దిష్టము లేకున్నను హెచ్చరికగలిగి సహగమనముచేసెదనని ప్రలా పించి ధైర్యముతోఁ గాటియొద్దికిఁబోయి సర్వప్రయత్నములు చేసి తుదకు నలుగురిచేత వలదు వలదని బ్రతిమాలించికొని మరలును.

ముంజ.—ఏడ్చువానిని నవ్వించెదవోయి వాధూలా నీవు.

విదూష.—మిత్రుఁడా! నే నంతవెఱ్ఱివాఁడనా? నీకు దుఃఖమున్న దంటే నమ్మెదనా? నీదే కాదు లోకములో మనయందఱదుఃఖ ములును బొల్లిదుఃఖములు. దుఃఖము చెప్పవచ్చినప్పు డా భర్తృహరి భార్యయగు భానుమతీదేవిది దుఃఖము.

ముంజ.—ఏమి? ఏమిచేసిన దాయమ్మ?

విదూష.—భర్తృహరి మహారాజు మహావిద్వాంసుఁడు మహాకవి. భానుమతి. మహావిదుషి. మహాపతివ్రత వారిద్దఱకుండు ప్రేమానుబంధ మనుభవవేద్యముగాని చెప్ప నలవికాదు. గువ్వలలోనయిన నట్టిప్రియదాంపత్యము గానము లోకములో మగలు చచ్చినప్పుడు మగువలు బావురుమని యేడ్చుటయు నొడలు అక్కఱకొనుటయు నోరు నెత్తి బాదికొనుటయు నేలఁ బడి పొరలుటయుఁ దలవెండ్రుకలు పీకికొనుటయు డగ్గఱనున్న వారిమీఁద గన్నీరువిడుపుటయు ముక్కుచీఁది చీమిడిపడ వేయుటయుఁ దమ్ము నూఱార్పవచ్చినవారిని బడఁద్రోయు టయు నివిమొదలుగాఁగల పనులుచేయుచుండుట చూచి మగఁడుచచ్చిన నింతయల్లరి చేయవలయునా యని భానుమతి చిఱునవ్వునవ్వుచుండును. భర్తృహరి యది గాంచి తాను మృతినొందినపిమ్మట తనభార్య దుఃఖపడదనియును మఱియు వేఱొకపురుషునిబెట్టికొని విలాసముతో నుండుననియును మహాకవియైనప్పటికి బుద్ధిమాంద్యముచేఁ దలంచి యొకనాఁడు వేఁటకొఱకని వనమ్మునకుంబోయి యందుండి తాను బులి

కాటుచేఁ జచ్చినవాఁడనని తనపెండ్లముతోఁ జెప్పి యాయిల్లా లేమిచేయునో కనిపెట్టి మరలివచ్చి తనకుఁ జెప్పుమని బంటు నొక్కని తనయింటికిఁ బంపెను. తెలివిమాలిన యాబంటును బోయి "మహారాజుగారిని బులి వేసికొనిపోయెను వారు స్వర్గస్థులయిరి తల్లీ" యని ద్వారమునొద్ద నిల్చున్న భానుమతి తోఁ జెప్పెను. అంతట నయ్యిల్లా లావార్త నిజమా యని ముమ్మాఱడిగి నిజమే యని యామూర్ఖుఁడు ముమ్మాఱును జెప్పుటయు నిజమకానమ్మి 'హా' యని నిల్చున్నయునికిన కట కటా ప్రాణములు విడిచెను.

ముంజ.—ప్రాణము విడిచెనే ? మరల బ్రదుకదయ్యెనే ?

విదూష.—విడిచె విడిచె బ్రదుకదయ్యె మిత్రుఁడా! ఇన్నినూఱు లేండ్లయినపిమ్మట నిప్పు డీమాట చెప్పునప్పుడు నాకుఁ గన్నీరు కాఱుచున్నది. డగ్గుత్తికపుట్టుచున్నది. ఆతరుణమందు వార్త విన్న యాదేవిమగఁ డెట్లు బ్రదికెనో యెంతఱాతిగుండెగల వాఁడో ! -

ముంజ.—ఏమి భర్తృహారికి దుఃఖము పుట్టదే ?

విదూష.—వార్త విని భర్తృహరి నాఁటఁగోలె దనతెలివితేమికిఁ దాను నిందించికొనుచు నారీరత్నమయిన ప్రియురాలిని గోలు పోయిన తనదురదృష్టమునకుఁ గుందుచు వైరాగ్యవృత్తితో నడవిలోనన సంచరించెను. ఆకాలములోనే సుమా యాతని వైరాగ్యశతకము చేయఁబడ్డది. చెప్పవచ్చిన దేమిటిదంటే మీదుఃఖములన్నియు బొల్లిదుఃఖములు కావున వానిని విడిచి సుఖంబుండుము.

ముంజ.—వాధూలా ! నీవు నాకు మిత్రుఁడవునుగావు. హాస్యరస హేతువువాఁడవునుగావు. నాకు బుద్ధులు చెప్పవచ్చిన యిష్ట దైవమవుగా నున్నావు.

విదూష.—అదిగావున నాబుద్ధులు విని లెమ్ము మిత్రుఁడా ! భోజన మునకు వేళ తిరిగెను. మధ్యాహ్నమయ్యెను.

[తెరలో]

లలితపదవృత్తము.—

ఉడికె సరస్సుల నొప్పెడు నీళ్లల్
వడిఁబడె నాఁచునఁ బాఱుచుఁ జేపల్
నడితలమీఁదికి నడిచె నినుండుం
గడచెను భోజనకాలము దేవా. 17

[అందఱు నిష్క్రమించిరి.]

ఇది తృతీయాంకము.

---

# భోజకుమారము

## చతుర్థాంకము.

రంగము - ముందఱగుండముగల రాజసభామంటపము.

[గుండమునొద్ద నిల్చున్న ఖరుఁడుఁ బింగళుఁడు ననునిద్దఱుకంచుకులు ప్రవేశించుచున్నారు.]

ఖరుఁడు.—గుండమున కీలోఁతు చాలురా పింగళా ?

పింగ.—చాలుఁజాలు నిలువులోఁతును బారెడువెడల్పును గల గుండము త్రవ్వుఁడని మన కాజ్ఞయయినది కదా.

ఖరుఁడు.—నారాయణ నారాయణ! యిదియేమి పాపకర్మము బ్రదికి యున్న రాజునకుఁ జితిపేర్చవలయుట సంభవించెను మనకుఁ బింగళా!

పింగ.—నిజ మిది పాపకర్మమే ఖరా! దుర్మార్గుఁడైనరాజును సేవించుటయే పాపకర్మము. రాజా మహారాజును భోజుని జంపించుటయేమి! సామంతుఁడు వత్సరాజు చంపుటయేమి! పిమ్మట రాజు పశ్చాత్తాపపడి తనకు శిక్షవిధింపుఁడని బ్రాహ్మణోత్తములను వేఁడఁగా నిప్పులగుండంబునంబడి చావుమని వారు తీర్పు తీర్చుటయేమి! నిప్పులగుండము త్రవ్వుఁడని రాజు నడుమ మనల నియమించుటయేమి!

ఖరుఁడు.—ఈపనికి రాజు మఱియొకని నియోగింపకపోయెనా? మనము చేయమన్న నాతఁ డేమిచేయునో?

పింగ.—నిష్కారణముగా నన్నకొడుకును జంపినవానికి మన మొక లెక్కయే? మారణశిక్షలో నున్నను నాయనచేతినుండి ముద్ర యింకను విడువఁబడదయ్యెను. కావున మన మీపని చేయమంటి మేని మనలనే నిప్పులగుండములోఁ బడఁద్రోయించును. కష్ట

ములలోనెల్ల దుర్జనసేవయే కష్టము. ఆసేవ కొడంబడిన పాపము చేసినదాని కిట్టి కృత్యములు మనము చేయవలసెను.

ఖరుఁడు ——ఇప్పుడు పశ్చాత్తాపముపుట్టినది సుమా రాజునకుఁ బింగళా!

పింగ.——వెనుకఁ జింతించుట వెఱ్ఱితనము. ఇప్పుడు పశ్చాత్తాపపడిన నేమిప్రయోజనము? చచ్చినభోజమహారాజు వచ్చునె?

ఖరుఁడు ——వచ్చినను రాకున్నను రాజుపాపము కొంతతగ్గును.

పింగ.——రాజుపాపము పశ్చాత్తాపమువలనఁగాదు కాని యీ మన త్రవ్వినగుండములోఁబడి ప్రాణత్యాగము చేసినమీఁదటఁ గొంత వట్టు తగ్గవచ్చును.

ఖరుఁడు ——కాదురా యిప్పుడు రాజునకు వైరాగ్యమార్గము పుట్టినదిరా పింగళా!

పింగ.——వైరాగ్య మెన్నివిధములు తెలియునా నీకు ఖరా?

ఖరుఁడు ——ఏమి యీలాగున నడిగెదవు? వైరాగ్య మొక్కవిధమే గాక యిన్నివిధములా?

పింగ.——నిజమైనవైరాగ్య మొక్కవిధమే కాని కపటవైరాగ్యము మూఁడువిధములు. అవి యేవంటేని బురాణవైరాగ్యముఁ బ్రసూతివైరాగ్యము శ్మశానవైరాగ్యము.

ఖరుఁడు.——వాని నిర్వచింపఁగలవె?

పింగ.——పురాణకథలు విన్నప్పుడు శమదమాదులును దయాదాక్షిణ్యాదులునుగలిగి లోకోపకారములు చేయుచుఁ బురాణపుణ్యపురుషులవోలెఁ బ్రవర్తింపవలయు ననుబుద్ధిపుట్టును. అదిపురాణ వైరాగ్యము. మఱికొంచెము సేపటి కాబుద్ధి మరలును. స్త్రీలు తాము ప్రసవించునప్పుడు తమప్రసవవేదన దలంచి యిఁక జన్మజన్మములకును మగఁడు వలవ దందురు. అది ప్రసూతివైరాగ్యము. అదియును నెలపురుడు వెడలుటతోడనే మరలును. మఱియు శవమును శ్మశానమునకుఁ దీసికొనిపోవునప్పుడు చూచువారికెల్ల నిది యస్థిరమని తోఁచును మఱికొంచెము సేపటికే యాబుద్ధి మాఱి కామక్రోధాదులకు లోనయి మమకారములోఁ బడుదురు. అది శ్మశానవైరాగ్యము.

ఖరుఁడు.—అట్టైన మనరాజువైరాగ్యము శ్మశానవైరాగ్యమా?

పింగ.—శ్మశానవైరాగ్యావస్థలోఁ బీనుఁగును జూచి యితరులు విరాగులగుదురు. ఇప్పుడు మనరాజు తనకు బ్రాహ్మణులు విధించిన ప్రకారము శ్మశానమునకుఁ బోవలయు నన్నదుఃఖముచేతఁ బుట్టినవైరాగ్య మపూర్వశ్మశానవైరాగ్యము.

ఖరుఁడు.—ఔరా! బ్రాహ్మణు లెట్టిమహానుభావులు! ఎంత నిష్పక్షపాతబుద్ధితోఁ దీర్పుదీర్చినారు! నేను బ్రాహ్మణుఁడనుగానుగాని తీర్పు చెప్పవలయునెడ వారే చెప్పవలయును.

క. ఇది సత్య మసత్యం బిది
యిది మే లిది కీడు న్యాయ మిది యన్యాయం
బిది కార్య మిది యకార్యం
బిది యని బ్రాహ్మణుఁ డెఱింగి పృథివిని నడచున్. 1

పింగ.—ఔనౌను ఖరా!

మానినీవృత్తము.—

కొందఱు ద్రవ్యముఁ జూట్టఱికంబును
గొందఱు జాతిమతాదులనుం
గొందఱు మానసజాతుని వియ్యముఁ
గొందఱుఁ బ్రత్యుపకారమునుం
గొందఱు లంచముగాఁ గొని మిక్కిలి
కోరికఁ బక్షము పూనుచుఁ దా
మెందును న్యాయము తీర్చుచు నుండుదు
రీవసుధాస్థలి నెల్లరునున్. 2

బ్రాహ్మణు లట్లు చేయరుసుమీ!

మానినీవృత్తము.—

తెల్లనివస్తువు లెల్లను మూఢులు దివ్యములం చిడి యాదలపై
నల్లనివస్తువు లెల్లఁ గడు న్మలినం బని పోవఁగఁ ద్రోయుదు రా
నల్లనిశౌరికి వార్నిధి లక్ష్మి మనఃప్రియమూర నొసంగుచు నా
తెల్లనిశూలికి నీఁడె విషంబును ధీనిధి పూనునె పక్షమిలన్. 3

[స్మరణ మభినయించి] ఒకగడియలో గుండము త్రవ్వి కట్టెలు పేర్చిరమ్మని మనకు రాజుగారు నియమించినపని యేమి! మిడిమిడి జ్ఞానముగల మనము తలకుఁ దగనియధిక ప్రసంగము సేయుచుఁ గవీశ్వరులవలె నీతులు వివరించుచు నిక్కడ నిలుచుటయేమి! మనము విధ్యుక్తంబగుపని చేసితిమి. కావునఁ బోదమురమ్ము. మన మిక్కడకు వచ్చునప్పుడే రాజుగారు స్నానమాడి పట్టుబట్టలుకట్టికొని యిక్కడకురా నుద్యోగించుచుండిరి. వారు మంత్ర్యాదులతో వచ్చెడువేళ యయ్యెను. [కొంచెము నడచిచూచి] అల్లదె వారు వచ్చుచున్నారిఁక లెమ్ము. గుండములోఁ గొంచెము చిచ్చువెట్టిపోదము.

[గుండములో నిప్పువైచి యుభయులు నిష్క్రమించిరి.]

ఇది విష్కంభము.

[అంతటఁ బయినిజెప్పినరీతిని ముంజరాజును మంత్రి యగుధనగుప్తుఁడును బూర్వపుమంత్రి యగుబుద్ధిసాగరుఁడును బ్రవేశించుచున్నారు.]

ముంజ — ఆ బ్రహ్మదేవుని వ్రాలు తప్పింప నెవరితరము?

ధన. — అవును మహారాజా!

ఆ. అగ్గి మ్రింగవచ్చు నలగాలియును మిన్నుఁ
బట్టి కట్టవచ్చు వసుధఁ జాప
చుట్టగాఁగ నొకఁడు చుట్టవచ్చునుగాని
తోడరి బ్రహ్మవ్రాలు తుడువఁగలఁడె. 4

చ. ఘనబలుఁ డైననేమి ఘనకార్యధురంధరుఁ డైననేమి తా
ననయము సత్యధర్మపరుఁ డైనను నేమి మహేంద్రవైభవం
బున వెలుఁగొందె నేమి మునిపుంగవుఁ డైనను నేమి దైవమా
తనదగు పూర్వకర్మఫలితంబును బొందకయుండ నేర్చునే. 5

దేవా! నీయట్టిసత్పురుషునకు రాఁదగ్గదికా దీకీడు. ఇది పూర్వజన్మసంచితముగాక వేఱొకటికాదు. నాఁడు రఘురాముఁ డరణ్యవాసి కాఁడె.

బుద్ధిశాలి. —

ఉ. చిక్కనినీతిమంతుఁ డవిసీ యెవరైనను విన్న నవ్వవా
రెక్కడుమాటలేమిటి కహీనమహాగుణశాలి రాఘవుం

డెక్కడ తుచ్ఛపాపి యితఁ డెక్కడ యేనుఁ గదేడ దోమతా
నెక్కడ పాపకృత్యము లనేకముఁ లీతఁడు నేఁడెసేయఁడే. 6

మ. తనునిష్కారణ మొక్కమానవుఁడు మోఁదంగట్టితో నెత్తిమీఁ
దను గుక్కొక్కటిరామమందిరబహిర్ద్వారంబునన్ వ్రాలి యే
డ్వ నతం డంతిపురంబునుండి చని తోడన్ వే విచారించి దో
షిని శిక్షించెను దత్సముం డిపుడు వీక్షింపంగ నున్నాఁడ శే. 7

లోకములో నెవ్వనికేని గష్టమువచ్చినప్పుడు పూర్వజన్మకర్మ ఫలమని పరామర్శచేయుట మర్యాదయయినది. ఈమర్యాద యనునది నిజమాడినచో వానిమనస్సు నొచ్చు ననుభయమువలనఁ గలిగినది కాని వేఱొకటఁగాదు. నేను హితవాదినిగాని ప్రియవాదినిగాను. ఈ మనరాజుకష్టము ప్రస్తుతస్వయంకృతాపరాథమువలనఁ గలిగినది కాని పూర్వజన్మపాపమువలనఁగాదు. [ముంజునితో] మహారాజా!

చ తనరఁగ నీదుసోదరుఁడు ధార్మికుఁడై వెలుఁగొందుసింధులుం
డినకులవార్థిచంద్రముఁ డహీనదయానిధి స్వర్గభూమికిం
జనియెడువేళ ముంజ నిను జక్కఁగఁ దమ్ముఁడ వంచు నమ్మి వే
తనసుతు నప్పగించుచు యథావిధిఁ బట్టముగట్టెఁగాద శే. 8

తరల.—

తనదు పుత్త్రుని నీకొసంగ కతండు వానికి రాజ్యమె
ల్ల నపుడే తగనిచ్చి నన్ను నిలం గ్రమంబుగ వానికై
తనర నేలఁగ నానతిచ్చిన ధారుణీతలమందునీ
కునికి యెట్టిది యాచునుండునొ యూహసేయుమ నెమ్మదిన్. 9

మత్తకోకిల.—

అన్న చేసినమేలు నీమది కయ్య యొక్కక తొల్తనే
నన్ను నీవటు దోషబుద్ధి మనంబునం జనియింపఁగాఁ
గ్రన్నన న్వ్రాలిచేసి యొక్కనిఁ గష్టు మత్పదమందినీ
మన్ననం దగనిల్పి యాటలు మానవేంద్ర యథేచ్ఛగా. 10

మత్తకోకిల.—

ఆడుచుంటివి నీప్రజావళి కంతకంతకు రాష్ట్రమం
దేడుపయ్యెడురీతిఁ బన్నులు హెచ్చుచేసి క్రమక్రమం

బీడఁబోని మదాతిరేకమహీనమౌ గతిఁ బెద్దలం
బీడబెట్టుచు రాజనామము పేరుఁ బెంపఱిపోవఁగన్. 11

శా. అంతం బోవక సింధులాత్మజుని నీ వైదేండ్లయబ్బాలునిన్
గంతుంబోలెడుమూర్తిమంతు నిరహంకారుం గుమారున్ సుదు
శ్చింతంబూని రహస్యమైనగతి నిన్నే నేఁడు చంపించితిం
తంటా నీదగుదుష్ప్రవర్తనము ముంజా మాకు లెక్కింపఁగన్. 12

ఉత్సాహ.—

పరగ నెత్తమీఁది గడ్డిపరక యొకటితీసినం
గరము తనిసి కోటిదానగతిగ నెంత్రు సజ్జనుల్
ధరణిఁ దమకుఁ బ్రాణ మిచ్చి తగఁగఁ గాపుచేసె నే
నరయఁ బగయ దాల్చు వారలౌరతద్దదుర్జనుల్. 13

మ. అకటా చేసినయట్టి మేల్మఱచి యన్యాయంబుగా నేఁడు దా
తకుఁ గీడుక్కవమారఁగా సలుపు నాతం డానికృష్టుండు పా
తకపాపిష్ఠుఁడు వానిపీనుఁగును రోతల్ గొంచె మేనిం జనిం
పక మ్రింగంగను గ్రద్ద లొప్పునటె యోపాపాత్మ వీక్షింపఁగన్.

ఉ. రాజనురాజనంచు మదిరంజిలుచుంటివె గర్వమారఁగా
రాజన రాజ్యమందుఁ బ్రజ రంజిలఁజేసెడువాఁడు గాక నీ
యోజమదాతిరేకమున నొక్కగజేంద్రము నెక్కి ప్రక్కలన్
వాజులు నేనుఁగుల్ నడువఁ బట్టణవీథులఁ గ్రాలువాఁడటే. 15

క. లెంకలజీతముమీఁదను
సుంకము గొనఁదలఁచి తదియు శుభకరమగునే
కొంకక యది లంచముగా
కింకేమి యనంగఁ దగుమహీస్థలిముంజా. 16

చ. కటకట రాజ్యభార మొకకట్టిడి మంత్రిపయిం ధరన్ మహా
కుటిలుఁడ వౌచు నుంచి పలుఁగోరిక లూరఁగ నుబ్బుచుండి నీ
వటమటఁజెంది నీదు ప్రజలందఱు బాధలు తెల్పికొన్నచో
నట సచివుం గనుంగొను మటం దకటా యిది రాజనీతియే. 17

మానినీవృత్తము.—

రాజును గాపులుఁ జక్కఁగఁ జూడ శిరంబును మేనెటు లట్టులె సూ
భూజనముల్ గడుపుష్టిగనుండిన భూపతి పుష్టిగనుండును జూ
మ్మీ జను లెప్పుడు నెమ్మది నొత్తురు మేదిని నప్పుడ చెట్టయగున్
రాజున కీపరమంపురహస్యము రాజవరాయెద నమ్మఁగదే. 18

మానినీవృత్తము.—

రాజన నెవ్వఁ డటంచుఁ దలంచితి రాష్ట్రములోఁ బ్రజకంతకునున్
భోజపితృవ్యుఁడ చోరులబాధయుఁ బొందుగఁ జారులబాధయుని
య్యోజనక్షామపుబాధయు రోగపుటుగ్రపుబాధయు లేనియటుల్
గాఁ జన మిక్కిలి నేర్పున నోర్పునఁ గార్యము సల్పెడు సేవకుఁడే.

తే. ఒకఁడు భుజియించి యొండొకఁ డుపవసించె
నేని తత్పాతకము పార్థివేంద్రుఁ డెందు
రాజును న్వానివాండ్రుమాత్రమ్ము నెగడ
వలయునే బ్రహ్మ పుట్టించెఁ బ్రజలనేల. 20

తే. కుడిచి కూర్చుండఁగా లేక కొడుకుఁ జంపి
తెచ్చికొంటివి యీముప్పు తివిరి నేఁడు
నిన్నుఁ జూచిన పాతకం బెన్నియేండ్లు
తపముచేసిననుంబోదు ధరణి ముంజ. 21

శా. దౌరాత్మ్యంబున నేరు సాయముగనో ధాత్రీశ దుశ్చేష్టలీ
వీరీతిం జరగించినాఁడ వకటా యీధాత్రి నవ్వార లి
ష్టైరీ మంత్రులు చూతమన్నఁ గనరా రింతే సుమీ యెందు నె
వ్వారుం గర్మఫలంబులం గుడువఁగాఁ బాత్రుల్ నిజం బారయన్.

ముంజ.—చిచ్చున నుఱకనున్న నన్ను వ్యథపెట్టనేల బుద్ధిసాగరా? ఇది ధర్మమగునే?

[తెరచాటున]

దేవా దేవా!

ముంజ.—ఎవ్వరి దాకేక మనచారాగ్రేసరుఁ డగుసూక్ష్మబుద్ధిదివోలె నున్నది.

ధన.—అవును దేవా!

[సూక్ష్మబుద్ధి పరువిడివచ్చుచుఁ బ్రవేశించుచున్నాఁడు]

సూక్ష్మ.—అవధారు దేవా!

ముంజ.—ఏమిరా చార! ఏమిరా సమాచారము?

సూక్ష్మ.—[వగురుచుచు] దేవా! [మఱల వగరుచుచు] దేవా [మఱల వగరుచుచు] యేమి చెప్పుదును!

ధన.—చెప్పు త్వరగాఁ జెప్పరా!

సూక్ష్మ.—[వగరుచుచు] దేవా ప్రజలందఱు సంతనకట్టినారు.

ముంజ.—ఏమిటికి సంతనకట్టినారురా?

సూక్ష్మ.—మూఁకలెల్ల రాజవీథిలో గుంపుగూడినవి.

ముంజ.—కూడిన నేమి?

సూక్ష్మ.—కాదుకాదు దేవా దండెత్తెదరట!

ముంజ.—ఎవరిమీఁదరా?

సూక్ష్మ.—[వడకుచు] దే-దే-దే-వరమీఁదనట.

ముంజ.—ఆఁ-ఆఁ-ఆ-ఎవఁడురా తోత్తుకొడుకు?

సూక్ష్మ.—విక్రముఁడు క్రోధనుఁడు చిత్రభానుఁడు సర్వజిత్తు వీరు మొదలుగాఁగలపురజనులందఱునుగూడి సుమంతుఁ డను నొకని సభాధ్యక్షుఁడుగాఁ జేసికొన్నారు. ఆసుమంతుఁ డంద ఱను బోధించినాఁడు. అప్పు డామార్గమునఁబోవు దేవర యాస్థానైకసంతగ్రాహి యగుకవీంద్రుఁడు దేవలుఁ డాసు మంతునిబోధనమంతయుఁ దాటాకుమీఁదను వ్రాసి యా యాకు నాచేతికిచ్చినాఁడు. ఇదె యవధరింపుము [అని తాటాకు ముంజరాజు చేతి కిచ్చుచున్నాఁడు].

ముంజ.—[తాటాకు ధనగుప్తుని చేతికిచ్చి]ఇది చదువుము మంత్రివరా!

ధన.—[తాటాకు చూచి చదువుచున్నాఁడు].

"క్రోధనాదిసోదరులారా! వినుండు వినుండు. ధర్మరాజ్యములు రెండువిధములు. అందు మొదటిది రాజైకపరిపాలితము రెండవది సంఘపరిపాలితము. ఉభయవిషయములలోను న్యాయశాస్త్రముల

కేలికలు కట్టువడి యేలుదురు. సభ్యులయనుమతిప్రకారము శాస్త్రములు నిర్మించుటకును మార్చుటకును నేలికల కధికారము కలదుగాని యా శాస్త్రముల నతిక్రమించి నడచుటకు వారికధికారము లేదు. రామాదుల రాజ్యములు ధర్మరాజ్యములు. వేనుఁడు మొదలగువారిరాజ్యములు క్రూరరాజ్యములు. శాస్త్రముల నతిక్రమించి వేనుఁడు హత్యలు మొదలగునకార్యములు చేయఁగా మునులెల్లనుగూడి వానిని ఖండించి కొంతకాలము సంఘరాజ్య మేర్పఱచిరాజైకపరిపాలితధర్మరాజ్యమును మఱపించి రాజ్యము జరపినవారు. ఒక్కకాపు దుర్మార్గుఁడయ్యేనేని వానిదుర్మార్గ మొకరిద్దఱను బాధించును. ఒక్కరాజభృత్యుఁడు దుర్మార్గుఁడయ్యేనేని వానిదుర్మార్గము వానియధికారము క్రిందిమండలములోనివారిని బాధించును. రాజు దుర్మార్గుఁడయ్యేనేని రాష్ట్రం బెల్ల బాధితమగును. మనభోజకుమారుఁడు బాలరాజు. వాని వధించుటచేత ముంజరాజు రాజహత్యయును శిశుహత్యయును నరహత్యయును బుత్రహత్యయును జేసినవాఁడయ్యెను. భోజకుమారుఁడు ప్రజానాథుఁ డగుటచే ముంజుఁడు ప్రజాహంతయుఁ గూడ నయ్యెను. ఇంకను వానికి బుద్ధిపుట్టినప్పుడు మముబోఁటివా రొకలెక్కయే ? ఇట్లు పంచమహాహత్యలుచేసిన యపాత్రుని మనకు నాయకుఁడుగా నునిచి కొనుటకంటె మహాపాతకము లేదు. వీని నిప్పుడ సంహరింపవలయును. వీనివెనుక రాజ్యస్థితిని బిదప విచారింతము. అనుకూలుఁ డొకఁడు దొరకెనేని రాజును జేయుదము. కాదేని సంఘరాజ్య మేర్పఱుతము. కాదేని సావిత్రీదేవిని రాణిగా నేర్పఱచి యొకబ్రాహ్మణసంఘమును గార్యనిర్వాహకులుగా నుంపుదము. అప్పటికథ మనకిప్పు డేల? యిప్పటికథ చూతము. మొదట గజాశ్వోష్ట్రశాలాదులు తగులఁబెట్టవలయును. మదోన్మత్తులై పక్షపాతము దాల్చుచును లంచములు గొంచును దుర్వ్యవహారముచేసిన రాజభృత్యులనెల్లఁ బొడుతము. కడపట ముంజునిఁబట్టణమధ్యంబునఁ గొట్టుగొట్టుదము. నిమిషము పోఁగొట్టఁ గూడదు. మనమూఁకలను వేగమ పోగుచేసి వీథులవెంటఁ దిరుగుచుఁ జేయఁదగ్గయల్లరులను జేయుదము. ఇది మీకెల్లవారి కంగీకారమగును గాదని చెప్పుఁడు.”

బుద్ధి.—[మనస్సులో] ఇది దివ్యముగా నున్నది. కుక్కుటోటునకుఁ జెప్పుదెబ్బన్నారు.

ముంజ.—[అరచేతితో బొమ్మమీఁదను గొట్టికొని బెంగ నభినయించి] ఔరా! యెంతపనిజరగినది. [చారునితో] తరువాత.

ధన.—తరువాత నేమి జరగినది చారా!

సూక్ష్మ.—[ముంజునితో] దేవా! అప్పు డామూఁకలోనివార లిది దివ్యముగా నున్నదనువారును నింతకంటె నెక్కువ చెప్పఁబని లేదనువారును మనసభాధ్యక్షుఁ డింత యొప్పఁబలుకునే యను వారును నోహోహో మనకడ కొకదివ్యపురుషుఁడువచ్చి మన లను బోధించినవాఁడనువారును నై యొప్పిరి.

ముంజ.—ఔరా! తరువాత.

సూక్ష్మ.—తరువాత గజశాలాదులం గూర్చి క్రోధనుఁడు కొంతబలము ప్రోవుచేసికొనిపోయెను. విక్రమాదులు పురమధ్యంబునఁ జతుష్పథంబుననుండి వచ్చుపోవుదుష్టభృత్యజనంబులను వధింత మని పయనమైపోయిరి.

[తెరలో]

దేవా! దేవా!

ముంజ.—ఇదియేమి? యింతలో నేమి మునిఁగినది? యీయేడ్పెలుంగు మనయోధాగ్రేసరుని కంచుకి యగువీరదాసునిది కాదా? [ముందఱచూచి] అదె వీరదాసుఁడు వచ్చుచున్నాఁడు. [వీరదాసునితో] ఏమిరా దాస!

వీర.—[వగరుచుచుఁ బ్రవేశించి వంగి నమస్కరించి] దేవా సర్వమంగళము దేవా!

ముంజ.—[తొట్రుపా టభినయించి] ఏమిరా యేమి మంగళమైనదిరా వీరదాస! మేము సర్వసంగపరిత్యాగముచేసి యిందున్న వారము. ఇంతకంటె నమంగళములు మాకు లేవు. అయినను జెప్పుచెప్పు.

వీర.—దేవా! దేవరభృత్యులెల్ల నాశముఁ బొందిరి. మూఁకలెల్ల నెక్కడెక్కడనున్న దేవరభృత్యవర్గమును బురమధ్యంబుననున్న

చతుష్పథంబున కీడ్చికొనివచ్చి ముక్కముక్కలుగ ఖండించెను. ఆమూఁకలకు నాయకుఁడు విక్రముఁడట.

ముంజ.—హాం! మనసేనాధిపతి వరాహవర్మ సుఖయా?

వీర.—ఒకయర్థమున.

ధన.—ఏమిరా పరిహాసముల కిది సమయమురా?

వీర.—[ముంజరాజుతో] దేవరతో నే నేసమయమందైనను బరిహాసము లాడఁదగినవాఁడనా? అతఁడు సంసారదుఃఖమునుండి తొలఁగింపఁబడి సుఖయైయున్నవాఁడు మహాప్రభూ!

ముంజ.—[చేతితో ఱొమ్మువిూఁదఁగొట్టికొని విషాద మభినయించి] ఔరా నాకుడిచేయి పడిపోయె నింకేమున్నది! వరాహవర్మ నాదేవికి సమీపపుఁజుట్టముకూడ నయ్యున్నవాఁడు.

బుద్ధి.—రాజా సంభవించుచున్నయాత్మనాశమును లక్ష్యపెట్టక సంభవించినబంధునాశమునకు దుఃఖించుట విచిత్రముగా నున్నది.

వీర.—ఆయనశరీరము పదియాఱువ్రక్కలుచేసిరి దేవా!

ముంజ.—అది యేమిరా?

వీర.—ఒకరాత్రి యాయన మదించి యాయుధపాణులైన పదియాఱు గురుబంట్లతోఁగూడి స్థానాధికారియింటికిఁబోయి తాను రాచకొలమునఁ బుట్టినవాఁడననియుఁ దాను సేనాధికారిననియుఁ దత్క్షణమ పదియాఱుకడవలకల్లు తనకుఁ బోయింపుమనియుఁ జెప్పి వానిని జంప యత్నించెనట.

బుద్ధి.—కర్మానుభవముతప్పునె? రాజు పక్షపాతియైన భగవంతుఁడు పక్షపాతి యగునె?

ముంజ.—[నిట్టూర్పువిడిచి] మనయార్థికమంత్రి యగుసౌధపతివర్మ యెట్లున్నాఁడురా వీరదాసా?

వీర.—ఆయన గళగ్రస్తుఁడైనవాఁడుసామీ!

ముంజరాజు.—

శా. ఎట్టెట్టూ కడుశీఘ్రకాలముననే యీయిష్టమర్త్యుందగన్
మెట్టుక్కంతము పట్టుపట్టి యనుచున్ మేముండఁగా నింట్లలోఁ

గట్టా దానికి విఘ్నమే యగుట యేకాకల్ల దైవంబు తా
నిట్టిరీతిని వానిఁ దీసికొనిపోయెఁ నేఁడ యింకేమనన్. 23

కటకటా! యెట్టివాఁడుపోయెను!

వీర.—అట్టివారినే దేవా వారు పట్టినారు.

బుద్ధి.—క్రూరకర్మములు కట్టికుడుపవె? అధికారగర్వముచేతఁ బొంగి యున్మత్తుఁడై సజ్జనులను బోధపతివర్మ పెట్టినయిడుమ లిన్ని యన్నియా?

వీర.—ఆయనచర్యలనుగ్గడించియే బోధపతివర్మను గాలుసేతులు గట్టి పెట్టి మూడుసారు లొకబురదగుంటలో ముంచియెత్తి మెడకు ఱాయిగట్టి యందుఁ బడవేసినారు క్రోధనాదులు దేవా! పాపము తాను మునుఁగునప్పుడు "అయ్యో నాబిరుదములా" "అయ్యో నాబిరుదములా" అని యేడ్చెను. అప్పుడు విక్రముఁడు నీబిరుదములు శుష్కబిరుదములని వాని నెన్నియో మాట లనెను దేవా!

ముంజ.—[తలపంకించి] కాలమహిమ! మన రెండవయార్థికమంత్రి ముండవర్మ యెట్లున్నాఁడురా కంచుకీ?

వీర.—ఆయనను యమమందిరమునకుఁ బంపిరి దేవా!

ముంజ.—[విచారముతో] నారాయణ! నారాయణ!

ఉ. మెల్లని మాటలుం మిగుల మెల్లని నెన్నడ మెల్లచూపులుం
మెల్లని మందహాసము నమేయవినమ్రత మేలిశాంతి యీ
యెల్లను గల్గి కార్యముల నింపుగఁ జేసెడువాఁ డటంచుఁ దా
మెల్లరుఁ జెప్పఁగాఁ దనరు నీతఁడు గూడను నేఁడు పోయెనే? 24

ధన.—ఆతఁడు మహాశాంతమూర్తిదేవా! పేరికిఁ దగినవాఁడు దేవా!

వీర.—[ముంజునితో] పేరికిఁదగినట్లాకారముండవలయునని చెప్పియే ముందఱ తలగొఱిగినారు దేవా! గొఱిగి "నీ నక్కవినయములనుబట్టి నీవు ధర్మవర్తనుఁడవని పామరజనులందఱు నిన్ను ముఖస్తవము చేయుచుండుటచేత నుబ్బుచుంటివిరా? పామరులకు విమర్శశక్తి యెక్కడిదిరా దురాత్మా" యని దూఱిరి దేవా!

ముంజ.—కటకటా! యెట్టిదుర్వార్తలు వినవలయుట సంభవించెను నాకు! భృత్యులలో నింకెవ్వరు చచ్చిరిరా కంచుకి?

వీర.—ఎవ్వరినని పేర్కొందును దేవా? గ్రామకరణము కృష్ణశర్మయుఁ బెద్దకాపు నాగదాసుఁడును మొదలు మంత్రులదాఁకఁ గల భృత్యులందఱును సమసిరి మహారాజా! కృష్ణశర్మ నాగదాసులను జంటగాఁ గట్టి ముక్కలుముక్కలుగా నఱికినారు దేవా! మఱియుఁ బరమహాకర్షకుఁడగు శ్వేతదాసుని రాజవీథిలోఁ గొఱుత నేసిరి మహాప్రభూ!

బుద్ధి.—వాండ్రముగ్గురికంటెఁ బరమతుచ్ఛులు లేరు. నేఁటికి వాండ్రకుఁ దగినశాస్తి యయినది.

ముంజ.—ఇట్టి స్వల్పులవర్తనములు రాజులకుఁ దెలియుట యెట్లు బుద్ధిసాగరా!

బుద్ధిసాగరుఁడు.—

క. తనభృత్యులవర్తనముం
గనుఁగొని కనుదెలిచి సర్వకార్యంబులలో
ననుదాన యుండినట్టుల
జననాథుఁడు రాజ్య మెపుడు సలుపఁగవలయున్. 25

అట్లుచేయనినాఁడు రాజ్యార్హుఁడు కాఁడు. విక్రమార్కాదుల చారిత్రములు వినవె?

ముంజ.—అయ్యో! యిదియేమి! అయ్యో! భారతయుద్ధసమయములో ధృతరాష్ట్రుఁడువలె నే నిక్కడ కట్టుపడియుండి యమంగళములు పరంపరగా వినవలయుట యగుచున్నది. ఇంకేమి విననయ్యున్నవో?

[తెరలో]

దేవా! దేవా!

ముంజ.—మరల నేదో మునిఁగినది. యీ యెలుఁగు నాయాత్మరక్షకభటనాయకుఁ డగువిచిత్రవర్మది [ముందఱ చూచి] ఏమిరా విచిత్రవర్మ?

విచిత్ర.—[ప్రవేశించి వగరుచుచు] దేవా! దేవా! సర్వశూన్యము దేవా! సర్వశూన్యము దేవా!

ముంజ.—ఏమి శూన్యమురా? మేమిక్కడ దీక్షలో నున్నాముగా!

విచిత్ర.—[ఏడ్చుచు] ఎవఁడో క్రోధనుఁడట! వాఁ డొకకూటువ మూఁకతో వచ్చి పురమెల్లఁ బాడుచేసెను దేవా!

ముంజ.—ఏమి పాడుచేసినాఁడురా? పుర మెట్లున్నదిరా?

విచిత్ర.—పరశురామప్రీతి యయ్యెను దేవా!

ముంజ.—ఏమి పరశురామప్రీతి యైనదిరా?

విచిత్ర.—ఏనుఁగుసాలలు గుఱ్ఱపుసాలలు లొట్టిలసాలలు సింగపు సాలలు టంకసాలలు గొలువుసాలలు నివి మొదలుగాఁగలవి యన్నియును బరశురామప్రీతి యయ్యెను దేవా! చూడ మన సైన వానిస్థానములైనను గానరావు మహాప్రభూ!

ముంజ.—ఔరా యెంతపని జరగినది!

విచిత్ర.—మఱియు దేవా! యెక్కడచూచినను గ్రామసింహములే గాని ప్రదర్శనశాలలో సింహములు గానరావు. చదరంగపు గళ్లలో జరగెడు నేనుంగులే గాని యేనుంగు లెందును లేవు. తాడిచెట్లగమళ్లవాఁడు కట్టినలొట్టిలే గాని లొట్టియ లెందును లేవు. చాకిబట్టలు మోఁచు నంచుమూతిగుఱ్ఱములే గాని గుఱ్ఱము లెందును లేవు. రథములు నూచనుగ్గయ్యెను. కాలుబలము కాలునిఁ గొలువఁబంపఁబడియెను. దేవా దేవరయును నిందు గలుగుమంత్రివరులును మిగిలిరి. ఇంకేమున్నది నాకుఁ జెప్ప మహాప్రభూ!

ముంజ.—[దుఃఖ మభినయించి] కటకటా!

ఉ. అన్నకుమారుఁ జంపితి నటంచును నిప్పులగుండమందు హా
క్రన్నన నన్ను జావుమని బ్రాహ్మణసంఘము తీర్పుదీర్చె నం
చున్నెడఁ గుందుచుండ నిటు శోకపువార్తలవచ్చె నక్కటా
యెన్నఁడుఁ గీడెగాక ధర నెందును గీడున మేలువచ్చునే? 26

మానినీవృత్తము—

వైపయివచ్చెడు చింతలవెల్లను బైపయిఁ బోవును వేగమునం
బాపముచేసినదానను లోఁతుగ మానసమందును గూరిన సం
తాపము వోవునె యెన్నివిధంబుల ధారుణియత్నముచేసిన సం
తాపము నిల్చిన వేళలవీరముఁ దాల్పఁగ శక్యమె చిత్తమునన్.

వగగూరియున్నచిత్తముగలనే నిప్పుడేమిచేయగలను ? కిల్బిష శంకయేగాక బలములెల్ల సమసె. వైరు లిప్పుడె పయిఁబడరానున్న వారు. వారువచ్చిన వారిచేఁ జావు నిశ్చయము. దానికంటె నియ్యగ్ని కుండంబునఁ బడిచచ్చుటమేలు. ఇదియును నీచపుఁజావేగాక సన్మరణ మగునె ? దారపుత్రాదులతోఁ బెద్దకాలము సుఖమనుభవించి వారి నెల్లర సంతోషపెట్టి ప్రజలను రంజింపఁజేసి వారివలన సంతృప్తివొంది పేరును బెంపును గాంచి ధర్మార్థకామములం దనిసి మోక్షార్థియై నెమ్మదిలో భగవంతునిఁ బ్రార్థించుచు మేనువిడిచి దివంబున కరుగుట యెంతయు నదృష్టమగును.

తే. అట్టి చావునకే నోఁచనైతి నకట
యేమి చేయంగఁగల దింక నెవరు దిక్కు
దిక్కుమాలినచావు సందియములేదు
చావవలయుట యయ్యెను జగతి నాకు. 28

కావున నాకిప్పు డార్తజనరక్షకుం డగుభగవంతుఁడుగా కిత రులు శరణ్యులు గారు. వాని నే వేఁడికొనెదను. [చేతులు జోడించి నిల్చుండి భక్తి యభినయించి దీనతతో]

ఉ. ఎవ్వఁడు వత్సలత్వమునఁ బృథ్విశిలాస్థలిఁ గప్పఁ బెంచువాఁ
డెవ్వఁడు గర్భకూపమున నెంతయుఁ బ్రేమను బిడ్డఁ బెంచువాఁ
డెవ్వఁడు నీటజంతువు లనేకములం దయతోడఁ బెంచువాఁ
డవ్విభుఁ డిచ్చుఁగాక ప్రియమారఁగ మాకును శోభనంబులన్.

ఉ. ఎన్నఁగవచ్చు నిద్ధరణి వృక్షములంగల యాకులెల్ల వే
యెన్నఁగవచ్చుఁ మింటఁగలఋక్షములం దరుణీశిరోజపం
క్తిన్నలి నెన్నవచ్చు జలధిం గలచేపల నెన్నవచ్చు నా
పన్నశరణ్య నావయినపాపము లెన్న నశక్య మీశ్వరా. 30

చ. అరయఁగ నాదుదోషముల నన్నిఁటిఁ జేరిచి కుప్పవేసినం
ధరణితలంబు నాకసముఁ దప్పక యేకమ యౌను దానినిం
గరము హరింప నీదయినకారుణికత్వము వెల్లి గొల్పినం
బొరిఁబొరి వేగ కొట్టికొనిపోవునుగాక యిఁకెట్లు పోవునే. 31

ఉ. తప్పులు పెక్కుసేసితివి తథ్యము నీ జనియించినాదిగా
నొప్పులు లేవు చూడ నిను నొల్లను గావ నటందు వేమొకో
తప్పులుసేయునప్పటికిఁ దథ్యముగాదటె కాచుటంట ? నీ
కొప్పుటపాపహారియను నున్నతనామ మదెట్టు లీశ్వరా ? 32

మానినీవృత్తము.—

నాదగు నిల్లును నాదగువాకిలి నాదగుపెండ్లము నాసుతులున్
నాదగు తోఁటయు నాదగుదొడ్డియు నాదుసమస్త మటంచు మదో
న్మాదము మీఱఁగ నుంటిని సర్వసమా నిను గానక యిద్ధరలో
నాదగుతప్పును గావఁగ దేయిఁక నన్‌దయ మీఱఁగఁ జూడఁగదే. 33

ఉ. వైరులు విఱ్ఱవీఁగుచును బారులుగట్టి ప్రలాపవాక్యముల్
వేరమిఁ బ్రేలుచు న్నిగుల వేడుక నిందును నందుఁ బోవుచు
న్నారు సమస్తలోకముల నాథుఁడ వీవు తదీయగర్వ మిం
పారఁగఁ జెల్ల నిచ్చు టిది యక్కట ధర్మవె యార్తరక్షకా. 34

చ. సమయము భక్తకార్యమును జక్కగ సేయఁగ నిప్డువచ్చె నీ
సమయము దప్పెనేఁ జెడును సర్వజగత్ప్రభువా మదీయకా
ర్యము దగ నేరిచేతను దిరంబుగఁ జేయఁగఁ జేసె నట్టివా
రిమదిని జొచ్చి చేయఁగదె శ్రేయము నాకిపు డార్తరక్షణా. 35

సీ. చచ్చిపుట్టిన సవ్యసాచి మన్మనినాఁడు
బ్రదికించితివి కాదె పరమకరుణ
నెన్నఁడో దివి కేగియున్నట్టి గురుపుత్త్రు
మరల నిచ్చితి కాదె పరమకరుణఁ
బుట్టిచచ్చినవిప్రపుత్త్రులనల్వురన్
మరల నిచ్చితి కాదె పరమకరుణఁ
బగవారు చీర ద్రౌపది దొల్వ నక్షయాం
బర మిచ్చితివి కాదె పరమకరుణఁ

గీ. నేఁడు భోజుని బ్రదికించి నీచమైన
యట్టి యీరీతి చావు న న్నక్కటకట
చావకుండంగఁ జేయవే జగతిలోన
దీనబాంధవకరుణాబ్ధి దేవదేవ. 36

[తెరచాటున]

ఉ. ఎవ్వఁడు వత్సలత్వమునఁ బృథ్వీశిలాస్థలిఁ గప్పఁ బెంచువాఁ
డెవ్వఁడు గర్భకూపమున నెంతయుఁ బ్రేమను బిడ్డఁ బెంచువాఁ
డెవ్వఁడు నీటజంతువు లనేకములం దయతోడఁ బెంచువాఁ
డవ్విభుఁ డార్తకోటికిఁ బ్రియంబున నిచ్చును శోభనంబులన్. 37

ముంజ.—[ఆశ్చర్యమును సంతోషమును నభినయించి] ఇదియేమి! ఆశ్చర్యమాశ్చర్యము! నాప్రార్థన సఫలమగునని యీవాక్కు సూచించుచున్నది. [ద్వారమువంకఁజూచి] ఎవఁడురా యక్కడ ద్వారపాలకుఁడు?

ద్వారపాలకుడు [ప్రవేశించి వందనమాచరించి] దేవా!

సీ. వలచేత మల్లెమొగ్గల నుల్లసిలు నేన్గు
దంతదండంబును దాల్చినాఁడు
కర్పూరమిళితమై గమగమవలచెడు
వెలిబూది మెయినిండ నలఁదినాఁడు
చంచద్రుచులవెల్గు స్ఫటికవికారకుం
డలములు చెవులకు డాల్చినాఁడు
రాగికెంజాయతో రంజిల్లుపెంజడల్
చోళ్లెంబుగాఁ దలఁ జుట్టినాఁడు

గీ. పట్టుకచ్చడ మొక్కటి కట్టినాఁడు
మూఁడుకన్నులదేవరంబోలినాఁడు
నెమ్మిఁ గాపాలికుఁ డొకండు నిల్చినాఁడు
వసుమతీనాథ మనసభాద్వారమందు. 38

దేవరయానతి యయ్యేనేని వానిని జొరనిచ్చెద నిది సమ్మతిగాదేని యవులఁ బంపెద నేమి సెలవు దేవా!

ముంజ.—[సంతోష మభినయించి] వారు నన్నుద్ధరింపవచ్చిన లోక
గురువులురా వారిని రానీరా ద్వారపాలక.

ద్వారపాలకుఁడు.—చిత్తముదేవా [అని నిష్క్రమించుచున్నాఁడు.]

కాపాలికుఁడు.—[ప్రవేశించుచు]

ఉ. ఎవ్వఁడు వత్సలత్వమునఁ బృథ్వీశిలాస్థలిఁ గప్పఁ బెంచువాఁ
డెవ్వఁడు గర్భకూపమున నెంతయుఁ బ్రేమను బిడ్డఁ బెంచువాఁ
డెవ్వఁడు నీటజంతువు లనేకములం దయతోడఁ బెంచువాఁ
డవ్విభుఁ డార్తకోటికిఁ బ్రియంబున నిచ్చును శోభనంబులన్. 40

ముంజ.—[కాపాలికునకు సాష్టాంగదండప్రణామముచేసి లేచి]
మహాత్మా ఇదె నమస్కారము.

మత్తకోకిల.—
భూరితేజులు భూతనాథసముల్ మహత్వసమృద్ధులి
ద్ధోరుకీర్తులు చారుమూర్తు లనూనరీతిఁ ద్రిలోకసం
చార లీరలు దివ్యవైద్యులచాడ్పుదోఁచెడిఁ జూడ మీ
పే రదెయ్యది యూ రదెయ్యది ప్రేమమీరఁగఁ జెప్పరే. 41

కాపాలి.—

మత్తకోకిల.—
పేరులేటికి నూరులేటికి వేడ్కమీఱఁగ లోకసం
చార మెప్పుడుఁ జేయువారము చంద్రమౌళిగురుండుమా
కీరసంబున నెవ్వఁడే నొరు నెక్కడేనియుఁ జంపెనేఁ
గోరి యందుల కేగి ప్రాణముఁ గూర్చువారము బొందికన్. 42

క. వినుము శిరంబును మొండెం
బును వేర్వేఱుగ నొనర్చి భువిఁ బాఱఁగవై
చినను నదికించి ప్రాణం
బును బోయఁగశక్తి మాకుఁ బొదలుచు నుండున్. 43

ముంజ.—మహాత్మా! నేను గొడుకునుజంపిన క్రూరకర్ముండను మీరు
నన్నుఁ జంపి కృపాళురై కొడుకును బ్రదికించి రాజ్య మియ్య
రయ్య పూజ్యులారా! మీరమరవరులు నేను మర్త్యుఁడను,
మీరు విమలమతులు నేను దుష్టబుద్ధిని క్షమధరించి నన్నుఁ

జంపి పుత్రుని గావరయ్యా! తనకు మేలుచేయు నార్యులైన వారికి మాఱు మేలుసేయ దాసుఁ డెంతటివాఁడు? కృతజ్ఞుఁడనై పరమభక్తితో మీకు మ్రొక్కఁగలవాఁడను. నాకుం గరుణించి నన్నుఁ జంపి కొడుకును గావరయ్యా! [అని నమస్కరించి వంగుచున్నాఁడు.

కాపాలికుఁడు.—జననమరణంబులు బ్రహ్మదేవునియాజ్ఞచేత వచ్చును గాని మనుష్యుఁడు వరించినంతమాత్రమున శక్యములగునా? కావున నిన్నుజంపుట మాకుఁ గార్యముగాదు. ఆమహేశ్వరుని కారుణికత్వముచే నీకుఁ బ్రహర్షమగునట్లు నీకుమారుని బ్రదికించి దీవించి మేమేగెదము రాజా!

క. మృతిఁబొందఁడు నీపుత్త్రుఁడు
శితికంఠుప్రసాదమునను సేమముతో న
క్షతతనుఁడై నీయింటికి
నతులితవిభవమునవచ్చు నధిక రయమునన్. 44

ఇప్పుడు మేము శ్మశానవాటికకుఁ బోయెదము హోమద్రవ్యములతో నీమంత్రి నొక్కని నీపుత్త్రునియందుఁ బ్రేమగలవాని నందులకుఁ బంపుము రాజా!

ముంజ.—[లేచి నిల్చుండి చేతులు జోడించి]తృప్తి నభినయించి. మహాప్రసాదము మహాత్మ!

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

---

# భోజకుమారము

## పంచమాంకము.

---

ధారాపురములో నొకవీథి.

[బ్రహ్మశర్మ శివశర్మ నారాయణశర్మ యనుముగ్గురుపౌరులు ప్రవేశించుచున్నారు.]

బ్రహ్మశర్మ.—ఔరా కాపాలికునిమహిమ! నిమిషములో భోజరాజును బ్రదికించి రాజునొద్దకుఁ దెచ్చి యప్పగించినాఁడు. ఏమి వాని తపోబలము!

శివశర్మ.—తపోబలముగాదు గిపోబలముగాదు నీవు ఛాందసుఁడ వగుటచేఁ దపోబలమనుచున్నావు బ్రహ్మశర్మా! ఆతం డాయుర్వేదము చదివినవాఁడు. అందు సంధానకరణి యనువిద్యచే భోజరాజుతల మొండెమున కదికించినాఁడు. ఆశాస్త్ర మెవఁడు చదివిన వాఁడే యిట్టిమహిమలు చూపఁగలఁడు. మనవైద్య శాస్త్రము సామాన్యమైనదా! అనాదిసిద్ధమైనది.

నారాయణశర్మ.—[చిఱునవ్వు నవ్వుచున్నాఁడు.]

శివ.—ఏమోయి నవ్వెదవు నారాయణశర్మా! నీనవ్వులో నేమో భావమున్నది. మనవైద్యశాస్త్ర మబద్ధమా?

నారా.—కాదు కాదు. మఱియు యోగశాస్త్రమును నబద్ధముకాదు శివశర్మా. [అని మరల నవ్వుచున్నాఁడు.]

శివ.—మఱియేమిటికి నవ్వితి చెప్పుము.

నారా.—ఎవరితోను జెప్పనని నాచేతిలోఁ జేయివేయుము శివశర్మా. నీవు నట్లచేయుము బ్రహ్మశర్మా.

శివ.—అమ్మతోడేసరి [అని తృతీయునిచేతిలోఁ జేయివేయుచున్నాడు].

బ్రహ్మ.—గాయత్రిసాక్షి [అని తృతీయునిచేతిలోఁ జేయివేయుచున్నాఁడు.]

నా రా.—ఇది మంత్రబలముగాదు యంత్రబలముగాదు తంత్రబలము. కాపాలికుఁడు వత్సరాజే సుమా.

బ్రహ్మ.—ఓహో!

శివ.—ఎట్టెట్టూ! అట్లయిన వత్సరాజీవిద్య నేర్చికొన్నాఁడా యేమి?

నా రా.—నీవు వట్టి మొద్దువోయి యింకను నీకు బోధకాదయ్యెనా?

శివ.—అందఱకును సమానముగాఁ దెలివితేటలుండునా లోకములో? కోపపడక మెల్లగఁ జెప్పవోయి నారాయణశర్మ.

నా రా.—నేను జెప్పినమాట కెదుటివాఁ డపార్థము చేసికొనునప్పుడు నాకు వచ్చుకోప మింకెప్పుడునురాదు. ఓర్పుగలిగి చివరదాఁక వినుము చెప్పెదను.

శివ.—అట్లే వినియెదను చెప్పు నారాయణశర్మా!

నా రా.—రాత్రివేళ మహామాయాభవనములో. వత్సరాజు భోజకుమారుని తల నఱుకుటకుఁ గత్తియెత్తఁగానే నీవు వంశనాశనమైపోయెదవని జలధరగంభీరస్వనంబున భోజకుమారుఁడు శపించెను. అట్లు శపించుటయు భోజకుమారుఁడు పిశాచమై తనను దనవంశమువారిని బట్టికొని నశింపఁ జేయునని భయపడి వడవడవడంకుచు వత్సరాజాయన నొక భూబిలగృహంబునందు భద్రముగునట్లు దాఁచి ముచ్చివానిచే నొకశిరస్సును జేయించి కొనిపోయి రాజునకుఁ జూపెను. రాత్రివేళ యగుటచే రాజాశిరమును నిరూపింపలేఁడయ్యెను. పిమ్మట రాజు నిప్పులగుండమునొద్ద నిల్చుండి దైన్యముతో భగవత్ప్రార్థనము చేయునప్పు డాతఁడు కాపాలికుఁడై పొడసూపెను. అట్లు పొడసూపుటకు ముందాతఁడు రాజసభాబహిర్ద్వారమునొద్దకుఁబోయి సభలోనున్న బుద్ధిసాగరుఁడు వెలుపలకువచ్చుటయు నాయనతో నేకాంతమాడెను. ఆయేకాంతసంభాషణమం దీనిజము వెల్లడిచేసెను. ముంజరాజు బ్రతికియున్నాఁడని చెప్పి కాపాలికుఁడవై రమ్మని బుద్ధిసాగరుఁడే వత్సరాజును బోధించెను. ఆచేరువను నేను బొంచియుంటి వారి యీయేకాంతసల్లాపములు సాంతముగా వింటిని. మఱియు

శ్మశానవాటికలోఁ గాపాలికుని గలసికొమ్మని ముంజరాజు పంపినమంత్రి బుద్ధిసాగరుఁడే సుమా !

శివ.—ఆహా యిప్పుడు తెలిసినది తెలిసినది. ఈయిద్దఱిలో నున్నదీ కిటుకు.

నా రా.—ఈపరమరహస్యము వెల్లడిచేసితి రేని మనకు సంభావన యిక్కడనే దొరకును మనబుఱ్ఱ లెగురును. చెవియున్నవానిని విననీకుఁడు.

శివ.—అమ్మతోడు. చండాలుఁడు [అని మరల నారాయణశర్మ చేతిలోఁ జేయివైచుచున్నాఁడు].

బ్రహ్మ.—గాయత్రిసాక్షి [అని మరల నారాయణశర్మ చేతిలోఁ జేయి వైచుచున్నాఁడు].

శివ.—మన మీమాటలసందడి నాలస్యము చేయుచున్నాము. భోజ పట్టాభిషేకమునకు బ్రాహ్మణులందఱు రావలయునని యాహ్వాయమువచ్చి గడియసేపయినదిగదా! ముహూర్తకాలము సమీపించినది పోవుదము రండు.

నా రా.—సభామండపములో భోజరాజు సింహాసనస్థుఁడై యున్న వాఁడు. అందు ముంజరాజును మంత్రులును సామంతరాజులు మొదలుగాఁగలవారు సమావేశమై యున్నవారు. బుద్ధిసాగరుఁడుకూడ ముంజరాజున కిష్టుఁడై యందే యున్నవాఁడు. వ్యవధి లేదు లెండు.

బ్రహ్మ.—మనలనందఱను లోపలికి రానిత్తురా?

నా రా.—దానికి సందేహమేమి?

ఉత్సాహ.—

వీరు వృద్ధులైనవారు వీరు బాలు రంచునున్
వీరు ధనికులైనవారు వీరు పేద లంచునున్
వీరు పురుషులైనవారు వీరు స్త్రీ లటంచునే
దేరుపఱుపరాదు భేద మిట్టి యుత్సవంబులన్.

మఱియు సార్థకనాముఁ డగుబుద్ధిసాగరుఁ డందున్నవాఁడు. ఆతిథ్యంబున నెవ్వరికిని లోపముండదు.

[తెరచాటున భేరీమృదంగాదిధ్వనులు మ్రోఁగుచున్నవి].

శివ.—అల్లదె సభామండపముదిక్కునుండి మంగళతూర్యరవంబులు వినవచ్చుచున్నవి. ముహూర్తకాలము సమీపించినది మనము కాలుక్రిందఁబెట్టకుండఁ బరువిడవలయును రండు.

[పురజనులు నిష్క్రమించిరి].

ఇది విష్కంభము

రంగము-రాజసభామండపము.

[అంత యథానిర్దిష్టంబుగ సింహాసనస్థుఁడైనభోజరాజును ముంజరాజును బుద్ధిసాగరాదిమంత్రులును విదూషకుఁడును సామంతులును బ్రాహ్మణులును బ్రవేశించియున్నవారు. భోజరాజున కిరుప్రక్కలను నీళ్లపసిఁడికుండలు చంకబెట్టికొని యిద్దఱుముత్తైదువులు నిల్చున్నారు.]

ముంజ.—[భోజునిఁ గౌఁగిలించికొని యానందబాష్పములు కార్చుచు] ఏమియాశ్చర్య మేమియాశ్చర్యము! ఏమి నాభాగ్య మేమి నాభాగ్యము!

ఆ. అధికదీర్ఘరోగి యారోగ్యమును గాంచు
నట్లు డప్పిగొన్న యతఁ డమృతపు
కడవగన్నరీతిఁగడుఁ బేదనిధిగన్న
భంగిఁ గొడుకు మగుడఁబడయఁగంటి. 2

అయ్యో సిద్ధుఁ డంతర్ధానమయ్యె వానిపాదములుపట్టి ముక్తి నందఁగోరితిని.

బుద్ధి.—ఆయనవచ్చినపని సఫలమయ్యె నింకేల యుండును దేవా?

విదూషకుఁడు.—

ఆ. అల్లఘనులు చేయు నాడంబరము సేయ
రవనిఁ గార్యకరణమందు ఘనులు
కార్యమైన పిదప ఘనులుపోలెను వార
లోసరిల్లుచుందు రొయ్యనొయ్య. 3

ముంజ.—నీవు చెప్పినది నిజము వాధూలా! మఱి దేవుల నిరువురను జేటీ జనసమేతముగాఁ బిలువుము.

విదూ.—దేవరసంకల్పసిద్ధులరు. ఇదె వారిరువురును జేటీజనసమేతముగను బ్రాహ్మణసువాసినులసమేతముగను విజయముచేయుచున్నారు.

[సావిత్రీదేవియు సుసీలాదేవియుఁ జేటీజనాదులతోఁ బ్రవేశించుచున్నారు.]

సావిత్రీదేవి—[భోజరాజును గౌఁగిలించికొని కన్నీరువిడుచుచు]

ద్విపద.—

ఎందుంటినాయనా యెందుంటితండ్రి
[గద్గదస్వరముతో]
యెందువోయితివయ్య యిందాఁక నీవు
[గద్గదస్వరముతో]
నీరాజ్యమెల్లను నిష్కారణముగ
నారవేసికొని తా ననుభవింపుచును
బట్టెడన్నము నీకుఁ బరమపుణ్యాత్మ
పెట్టఁగా బరువు నీపినతండ్రికయ్యె. 4

... ... ... ... ...

... ... ... ... ...

ముంజ—[జనాంతికముగా విదూషకునితో] ఇదియేమి వాధూలా సావిత్రీదేవిపరమపతివ్రత నన్నుశపించునని భయమగుచున్నది. యేమిచేయుదును? పతివ్రతశాప మూరకపోదు.

విదూ.—[జనాంతికముగా] దాసునితప్పు దండముతో సరియన్నట్టు లింకేమియు వలవదు. మెడకుబట్టచుట్టికొని యీయమ్మపాదములకు నమస్కరింపుము.

ముంజ.—[ఉత్తరీయము మెడకుఁజుట్టికొని సావిత్రీదేవికి సాష్టాంగదండప్రణామముచేసి నిల్చుండి చేతులుజోడించి విషాదమభినయించి] అమ్మా యిదె నమస్కరించుచున్నాను.

ఆ. కొడుకుఁ జంపినట్టి క్రూరకర్ముండు నీ
పాదములకుఁ దల్లి వందనంబు

సలుపఁ దగఁడు నన్నుఁ జంపించి సుతునకు
రాజ్య మియ్యవమ్మ పూజ్యురాల. 5

ఆ. ఎఱిఁగి యెఱిఁగి యొండె నెఱుఁగక యొండెను
దప్పుచేసినాఁడఁ దల్లి నేను
మహితలంబునందు మగవాఁడొ మ్రానో య
టన్న వాక్కు వినవటమ్మ తల్లి. 6

సావిత్రీ.—[భోజునివదలి ప్రసన్నురాలై ముంజునితో] చిరంజీవ చిరంజీవ.

విదూ.—[జనాంతికముగా ముంజునితో] బ్రతికిపోయితివిరాజా నీభాగ్యముచే నీవదినె ప్రసన్నురాలయినది. ఆఁడువార లల్ప సంతోషిణులు.

ముంజ.—[ధనగుప్తునితో] మంత్రివరా యీముహూర్తమునంద రాష్ట్రమునకు భోజుని బట్టముగట్టి నేను వానప్రస్థాశ్రమము గైకొనెదను.

ధన.—ఇప్పుడు దేవర కృతార్థులైతిరి. మాకందఱకునుసంతోషముగా నున్నది. దివ్యచిత్తంబునకు బోధరైన ట్లవధరింపవచ్చును. అయినను దేవా! వానప్రస్థవిషయమయి తొందరపడవలదు.

ముంజ.—[భోజరాజున కిరుప్రక్కలనున్న యైదువులతో] ఐదువలారా పూర్ణకలశమ్ము లిట్లుండు.

గీతము. శంకరాభరణరాగము. ఏకతాళము.

ఐదువలు.—

అంగనామణు లిదె మంగళస్నానము
పొంగుచుమదిలో నొసంగువారు
అంగజనిభగాత్ర మంగళస్నానము
రంగుమీఱఁగ సలుపంగదయ్య. 7

[అనిపాడుచుఁ బూర్ణకలశము లంది యిచ్చుచున్నారు.]

ముంజ.—[పసిఁడికుండలలోనినీళ్లతో భోజు నభిషేకించి]

ఆ. దక్షిణాపథంబు తగగౌడతోఁగూడఁ
బెద్దకాల మిఁకాపు పేరుఁబెంపు
సెసక మెసఁగ నెలమి నేలు మేకచ్ఛత్ర
ముగను నేఁడుమొదలు భోజరాజ.

[ఆకాశమున గీతము.]

ఆ. అయిదు పదులు నైదు నగువత్సరమ్ములు
మూఁడునాల్గునెలలు మూఁడునాళ్లు
దక్షిణాపథమ్ము తగగౌడతోఁగూడ
భోజరాజుచేత భోజ్యమగును.

బ్రాహ్మణులు.—తథాస్తు.

ప్రథమబ్రాహ్మణుఁడు.—మే మిఁదలంచినయాశీర్వాదము ముందాకాశవాణియే యిచ్చెను. ఈమహారాజు దివ్యపురుషుఁడు.

[మరల నాకాశమున]

సీ. ప్రభుమాత్రుఁడవె నీవు పరిశీలనముసేయ
ధరణిలోఁ గవిపండితప్రభుఁడవు
కవివరుండైనట్టి కాళిదాసుండు నీ
కాస్థానకవియౌచు నమరియుండు
వాధూలగోత్రమన్వాలమున్నీటిలోఁ
జందమామ యనంగ నంద మొందు
కాదూరిరామర్షి తల్లజునకు సీత
మాంబికా స్త్రీరత్నమందుఁబుట్టఁ
గీ. గలఁడు లక్ష్మీనృసింహాఖ్యకవి యతండు
స్త్రీపురుషమర్మభావముల్ తెలియఁగలఁడు
నీదుపినతండ్రి చేష్టలు నిజయుంబు
వాఁడు వెల్లడిచేసెడువాఁడు భోజ. 10

సభ్యులు.—[ఆశ్చర్య మభినయించుచుఁ దలలెత్తియాకాశమువంకఁ జూచి] ఔరా యేమి యీపురుషునిదివ్యమహిమ!

ఇద్దఱు ముత్తైదువులు.—[భోజరాజునకు హారతి యిచ్చుచుఁ బాడుచున్నారు.

శంకరాభరణరాగము. ఏకతాళము.

మంగళమగుభోజమానవేంద్రునకు నీ
మారసుందరునకు మంగళమ్ము
మంగళమగుఁగాక మహితసావిత్రికు
మారరత్నమునకు మంగళమ్ము.

ముంజ. [భోజరాజుతో] నాయనా కన్నులార నీమహోత్సవము చూడఁగాంచితిని [జయంతునిఁ జూపి] వీఁడె నీకుఁ బ్రియుఁడగుజయంతుఁడు వీనిని నీయొద్ద నుంచికొమ్ము. తక్కిన నా కొడుకులకుఁ జెఱియొక గ్రామము నిచ్చినవాఁడను. ఇంక నేను మీజనయిత్రీసమేతంబుగ వానప్రస్థాశ్రమము గైకొనెదను నీకేమి కావలయును గోరుము.

భోజరాజు.—నాకు మీదయతప్ప వేఱేమియు వలవదు తండ్రీ.

ముంజ.—అట్లయిన నిదియగుఁగాక.

భరతవాక్యము

క. ఇల న్యాయము దీర్చెడుతఱి
వలయు నృపుఁడు తీర్ప నుభయవాదులనడుమన్
నలివారిజాతివర్ణా
దులభేదము లెంచఁబోక తుల్యమనీషన్. 12

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

ఇది
శ్రీమదాపస్తంబసూత్ర వాధూలసగోత్ర
తాడూరి లక్ష్మీనరసింహారాయ
ప్రణీతంబైన
భోజకుమారము
సంపూర్ణము.



చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1934.